# బైబిలుదర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

**G. W. FOOTE & W. P. BALL**

## 1. అసంబద్ధాలు

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

# బైబిలు దర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

**G. W. FOOTE & W. P. BALL**

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

FOR FAVOUR OF REVIEW

పశ్చిమ గోదావరి జిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు – 534 260

# BYBILU DARSINI

*Translated by:*
PENMETCHA SUBBARAJU

ప్రథమ ముద్రణ : అక్టోబరు 1986
ప్రతులు 1000

ప్రతులకు :

పెన్మెత్స సుబ్బరాజు (పియస్సార్)
జిన్నూరు - 534 265
ప. గోదావరి జిల్లా

వెల రు. **4-00**

రావిపూడి వెంకటాద్రి కంబైండ్ ఎడిషన్: రు. 25-00
ఎడిటర్, హేతువాది
చీరాల - 523 155

ముద్రణ
నాగార్జున ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్,
తెనాలి

ప్రచురణ :
పశ్చిమ గోదావరి జిల్లా హేతువాద సంఘం
పాలకొల్లు - 534 260

# పరిచయం

ప్రతి మతానికి ఒక ప్రామాణిక గ్రంథం తప్పని సరిగా ఉంటుంది. మతం అంటే సైద్ధాంతిక ఆలోచన అనే భావాన్ని స్ఫురింప చేస్తుంది ఆ పదం యొక్క ఉత్పత్తి అర్థం. కాల క్రమేణ అర్థం మారింది. దేవునికీ మానవునికీ మధ్య ఉన్న సంబంధాన్ని నిర్వచనం చేసేవి మతమనేది రూఢ్యర్థం అయింది. ఇపుడీ అర్థంలోనే మనం దానిని అవగతం చేసుకుంటున్నాం.

మత ప్రామాణిక గ్రంథానికి ప్రాశస్త్యం ఎలా ఏర్పడింది ? ఏదైనా మాట అధికారంలో ఉన్న వ్యక్తి, పదవిలో ఉన్న మనిషి చేప్తే విలువ ఇస్తున్నాం. దేవుడే చెప్తే మరీ మంచిది. అందుకే దైవదత్తం అయిన దానికి విలువ ఎక్కువ. అశరీరవాణి పలుకుతుంది, లేక ఓంకార నాదం వినిపిస్తుంది. ఓంకారంలో నుండి అన్ని శబ్దాలు పుట్టాయి. ఇది హిందువుల ఆలోచనా రీతి. దేవదూత "ప్రవక్త" చెవిలో ఊదుతాడు. అది "ఖుర్ ఆన్"గా మహమ్మదుగారి నోట వెలువడింది. సాక్షాత్తు దేవుడు చెప్పింది కనుక దానికి పవిత్రత వచ్చింది. హిందువుల శ్రుతి వాక్యాలకూ, మహమ్మదు పలికిన 'ఖుర్ ఆన్' పదాలకూ ఇదే సామ్యం.

క్రైస్తవం పరిస్థితి కొంచెం వేరుగా ఉంటుంది. ఏసు బోధకుడు; ప్రబోధకుడు. బ్రహ్మచారి, సంచారి. రోమను సామ్రాజ్యంలో భాగంగా ఉన్న యూదు దేశవాసులకు నూతన మతాన్ని అందించిన మనిషి. దాస్యంలో బ్రతుకు తున్న యూదు జాతీయులకు విముక్తి మార్గం తెలియజెప్పాడు. అది తిరుగుబాటు దారి కాదు. సంఘర్షణ విధానం అంత కన్నాకాదు. కాగా మానసిక స్వాతంత్ర్యాన్ని ప్రబోధించే తత్వం అది. ఆ పరిస్థితుల్లో అది మంచి మార్గంగా తోచింది ఆతనికి.

పూర్తిగా క్రొత్త సిద్ధాంతాన్ని చెప్తే ప్రజలు ఆదరిస్తారో లేదో అని ప్రతి నూతన మార్గగామికి భయం ఉంటుంది. కనుకనే "పాతను కాదనను, పూర్వ ప్రవక్తల మార్గాన్నే అనుసరిస్తాను. వారి మాటలను సఫలీకృతం చేస్తాను' అంటాడు.

అలాగే చెప్పాడు ఏసు. పాత నిబంధన సూత్రాలను త్రోసి రాజనలేదు; ఆమో దించాడు. అలా మరో ప్రవక్త కాగల అవకాశం ఆయనకు వచ్చింది. ఆయన బోధల వల్ల అణగారిన జనం, పీడిత ప్రజానీకం, కష్ట జీవులు-అందులో ముఖ్యంగా స్త్రీలు ప్రభావితులయ్యారు. శారీరక హింస ఎలాగూ తప్పించుకోలేనివారు మానసిక స్వేచ్ఛను పొంద ప్రయత్నించారు. ఆత్మ గౌరవాన్ని పెంచుకోవటానికి ఏసు ప్రవ చనాలు వారికి తోడ్పడ్డాయి. వారికి ఆయన యెడ భక్తి భావం కలిగింది. ఆయనను "మనుష్య కుమారుడని" "దేవుని కుమారుడని" సంబోధించ సాగారు. ఇంచు మించుగా ఏసు దేవునితో సమానుడయినాడు.

ఏసు మరణానంతరం సుమారు వంద సంవత్సరాలకు ఆయన జీవిత చరిత్ర వెలువడింది. జీవిత చరిత్ర అంటే వయసగా తేదీల వారీ చరిత్ర కాదు. ఆయన భావాలు, వాటి వ్యాప్తిని గురించిన చరిత్ర. అదే బైబిలు. దానిని నల్గురు ముఖ్య శిష్యులు వ్రాశారని చెప్తారు. అవి "లూకా సువార్త', "మార్కు సువార్త", "యోహాను సువార్త", "మత్తయి సువార్త"లుగా చలామణీ అవుతున్నాయి. ఇవి క్రొత్త నిబంధనలో ముఖ్య భాగాలు. పాత నిబంధన యూదు జాతి చరిత్ర. రెండూ కలిసి "బైబిలు గ్రంథం" అయింది. అలా అది పవిత్రతను చేకూర్చు కున్నది. "పరిశుద్ధ గ్రంథమయి" కూర్చున్నది. క్రైస్తవుల మనఃఫలకాలపై చెర గని ముద్రను వేస్తున్నది. ప్రతి వాక్యాన్ని పవిత్రంగా భావించ ప్రారంభించారు క్రైస్తవులు. అసలు స్వరూప దర్శనం కనుమరుగయింది. అర్థం ప్రాముఖ్యతను కోల్పోయింది. కేవలం "వాక్యం" నిలిచింది. దీనితో అసలు చిక్కు ప్రారంభ మయింది.

మత ప్రామాణిక గ్రంథాన్ని చదవడం, అధ్యయనం చేయడం, అవగాహన చేసుకోవడం ఒక ఎత్తు. దాన్ని పరమంగా, పవిత్రంగా, మార్పుకు అతీతంగా, శిరో ధార్యంగా గమనించటం మరో ఎత్తు. రెండవ మార్గపు మత్తులో మునిగిపోయిన వారికి కనువిప్పు కలిగించటానికి మార్గాలు అనేకం. తాత్విక ఆలోచనను సర్క్రాంత్త రూపంలో పరిచయం చేయడం ఒక పద్ధతి. కాగా, అది అందరికీ సుగ్రాహ్యం కాక

పోవచ్చును. అలాకాక "పరిశుద్ధ గ్రంథం"లోని మాలిన్యాన్ని, అసందర్భాలను, వైరుధ్యాలను, అశ్లీలాన్ని, అప్రస్తుతాలను, అవినీతిని వెలికిదీసి చూపించటం రెండవ విధానం. దీనిని అనుసరించారు "బైబిలు హాండ్‌బుక్" గ్రంథ కర్తలు ఫూట్ & బాల్. ఈ పద్ధతి ఇప్పుడు అనవసరమంటారు కొందరు. కాని "భక్తుల"ను నిద్ర లేపాలంటే ఇంతకన్న మంచి మార్గం మరొకటి లేదు.

"బైబిల్ హాండ్‌బుక్" పూర్తి పాఠాన్ని తెలుగు చదువరులకు అందిచ్చే నిమిత్తం మిత్రుడు పెన్మెత్స సుబ్బరాజు కృషి చేశాడు. ఆ కృషి ఫలితమే ఈ పుస్తకం.

అక్టోబర్ 1983,
హైదరాబాద్

ఎం. వి. రామమూర్తి
భారత హేతువాదసంఘ అధ్యక్షులు.

# అనువాదకుడి మాట

నేడు ప్రపంచంలో విస్తృతంగా ప్రచారం చేయబడుతున్న మతం క్రైస్తవం. ఈ మతానికి మూలగ్రంథం బైబిలు. ప్రపంచంలో అత్యధిక భాష ల్లోనికి అనువదించబడిన ఏకైక గ్రంథం ఇదే. ఈ మత భావాల వ్యాప్తికి ఉచితం గాను, తగ్గింపు రేట్లకును బైబిలును ప్రజలకు సరఫరా చేయడానికి క్రైస్తవ పీఠాలు ఏటా కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తున్నాయి. మూలగ్రంథం ఒక్కటే అయినా క్రైస్తవులు వందలాది శాఖలుగా విడిపోయి తమలో తాము కలహించుకుంటున్నారు. దైవగ్రంథంగా ప్రస్తుతించ బడుతున్న బైబిలును ప్రతి క్రైస్తవ శాఖవారు తమ కనుకూలంగా మలచుకొని చూపుతున్నారు.

అన్ని మతగ్రంథాల వలెనే బైబిలు కూడ అనేక అసంగతమైన భావన లని, పరస్పర విరుద్ధ విషయాలను చెపుతున్నది. ఆనాటి జ్ఞానంతో పోల్చిచూస్తే అది తప్పు కాకపోవచ్చు కాని, 21వ శతాబ్దంలోకి అడుగిడబోతున్న ఈశాస్త్ర సాంకే తికయుగంలో కూడ తప్పులను ఒప్పులుగా ప్రచారం చేస్తున్న క్రైస్తవం బారినుంచి సమాజాన్ని కాపాడవలసిన బాధ్యత హేతువాద మానవవాదులందరిమీదా వుంది.

ఆంగ్లంలో బైబిలు మీద విమర్శనాత్మక గ్రంథాలెన్నో వచ్చినా, ఆ క్రమంలో తెలుగులో సరైన కృషి జరగలేదు ఆ లోటును కొంతయినా భర్తీ చేయడానికే The Bible Handbook అనువాదం చేపట్టాను. ఇది బైబిలు మీద సమగ్ర పరిశీలన కాకపోయినప్పటికీ, సంతుష్టిని కలిగించే స్థాయిలోనే సాగింది. మూలగ్రంథాన్ని యథాతథంగా తెలుగులోనికి అనువదించడానికి చాలా శ్రమపడవలసి వచ్చింది. బైబిలులోని చివరి పుస్తకమైన ప్రకటన గ్రంథంలోని చివరి అధ్యాయం "ఎవడైనను వీటితో మరి ఏదయినను కలిపినయెడల, ఈ గ్రంథములో వ్రాయ బడిన తెగుళ్ళు దేవుడు వానికి కలుగజేయును; ఎవడైనను ఈ ప్రవచన గ్రంథ మందున్న వాక్యములలో ఏదైనను తీసివేసిన యెడల, దేవుడు ఈ గ్రంథములో వ్రాయబడిన జీవవృక్షములోను పరిశుద్ధపట్టణములోను వానికిపాలు లేకుండచేయును" అని చెబుతున్నా క్రైస్తవులు దీనికి కట్టుబడివున్నట్లు కనిపించడం లేదు. విమర్శల బారినుండి తమను రక్షించుకోవడానికి ప్రతి అనువాదంలోను ఎంతోకొంత మార్పు చేస్తూనేవున్నారు. మరి వీళ్ళంతా బైబిలులో పేర్కొనబడ్డ సమస్త తెగుళ్ళకు గురయి నిత్యనరకాగ్నిలోనికి పోతున్నారో లేదో నాకు తెలియదు. క్రైస్తవులు

బైబిలులో చేస్తూవస్తున్న మార్పులకు తాజా ఉదాహరణ ఈ మధ్యనే తెలుగు వాడుక భాషలోనికి అనువదించిన "పవిత్ర గ్రంథం". ఈ కారణంవల్ల మూల గ్రంథాన్ని యథాతథంగా తెలుగులోనికి అనువదించడం కష్టమై ఒక్కోచోట కొన్ని అంశాలను తొలగించవలసి రావడమేగాక, మరికొన్ని చోట్ల అదనపు విషయాలను చేర్చవలసి వచ్చింది. అంతగా విషయ ప్రాధాన్యం లేని కొన్ని విషయాలను పూర్తిగా తొలగించడం కూడ జరిగింది. తెలుగు అనువాదానికి "పరిశుద్ధ గ్రంథము'ను అనుసరించాను. అనువాదంలో అదనంగా చేర్చిన భాగాల చివర "అను", అని చేర్చబడింది

ఈ అనువాద కార్యక్రమంలో నాకు ప్రోత్సాహాన్నందించిన మిత్రులెందరో ఉన్నారు. వారందరికీ నా కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని అనువదించవలసిందిగా ప్రోత్సహించి వ్రాతప్రతికి తుదిరూపం ఇవ్వడంలో సహాయపడిన ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘాధ్యక్షులు, బహుముఖ మేధావి శ్రీ రావిపూడి వెంకటాద్రిగారికి కృతజ్ఞతలు అలాగే పుస్తకానికి తమ అమూల్యమైన పరిచయాన్ని వ్రాసి యిచ్చిన భారత హేతువాద సంఘాధ్యక్షులు శ్రీ యం. వి రామమూర్తిగారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ పుస్తక ముద్రణ సమయంలో ప్రూఫులు దిద్దే బాధ్యతను తీసుకుని మిత్రులు ప్రఫుల్ల చంద్రగారు చేసిన సహాయం, పడినశ్రమ నేను తీర్చుకోలేనివి. పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన నాగార్జున ప్రెస్, తెనాలి వారికి నా ధన్యవాదాలు.

ఈ "బైబిలు దర్శిని" సత్యాన్వేషులను ఎంతగానో ఆకట్టుకుంటుందన్న నమ్మకం వుంది. దీనికి పాఠకులనుంచి లభించిన ఆదరణనుబట్టి బైబిలు మీద, క్రైస్తవం మీద మరికొన్ని పుస్తకాలను స్వయంగా తీసుకువచ్చి తెలుగులో బైబిలు మీద విమర్శనా గ్రంథాలు లేనిలోటు తీర్చాలన్న ఆలోచన వుంది. ఇందుకుగాను తమ అమూల్య సలహాలను సూచనలను అందజేయాల్సిందిగా మిత్రులను కోరుతున్నాను.

జిన్నూరు
1 అక్టోబరు 1986

పెన్మెత్స సుబ్బరాజు

# ఈ పుస్తకంలోని సంకేత పదాల వివరణ

| సంకేతం | పరిశుద్ధ గ్రంథము | పవిత్ర గ్రంథం | The Holy Bible |
|---|---|---|---|
| 1 ఆది | ఆది కాండము | ఆరంభాలు | Genesis |
| 2 నిర్గ | నిర్గమకాండము | దాస్యవిముక్తి | Exodus |
| 3 లేవీ | లేవీయ కాండము | యాజి ధర్మశాస్త్రము | Leviticus |
| 4 సంఖ్యా | సంఖ్యాకాండము | ఎడారి ప్రయాణాలు | Nnmbers |
| 5 ద్వితీ | ద్వితీయోపదేశకాండము | ధర్మోపదేశం | Deuteronomy |
| 6 యెహో | యెహోషువ | యెహోషువ | Joshua |
| 7 న్యాయా | న్యాయాధిపతులు | నాయకులు | Judges |
| 8 రూతు | రూతు | రూతు | Ruth |
| 9 1 సమూ | సమూయేలు మొదటి గ్రంథము | సమూయేలు-1 | 1 Samuel |
| 10 2 సమూ | సమూయేలు రెండవ గ్రంథము | సమూయేలు 2 | 2 Samuel |
| 11 1 రాజు | రాజులు మొదటి గ్రంథము | రాజులు-1 | 1 Kings |
| 12 2 రాజు | రాజులు రెండవ గ్రంథము | రాజులు-2 | 2 Kings |
| 13 1 దిన | దినవృత్తాంతములు మొదటి గ్రంథము | దినవృత్తాంతాలు-1 | 1 Chronicles |
| 14 2 దిన | దినవృత్తాంతములు రెండవ గ్రంధము | దినవృత్తాంతాలు-2 | 2 Chronicles |
| 15 ఎజ్రా | ఎజ్రా | ఎజ్రా | Ezra |
| 6 నెహె | నెహెమ్యా | నెహెమ్యా | Nehemiah |
| 17 ఎస్తే | ఎస్తేరు | ఎస్తేరు | Esther |
| 18 యోబు | యోబు గ్రంథము | యోబు | Job |
| 19 కీర్త | కీర్తనల గ్రంథము | కీర్తనలు | Psalms |
| 20 సామె | సామెతలు | సామెతలు | Proverbs |
| 21 ప్రసం | ప్రసంగి | ప్రసంగి | Ecclesiastes |

| | | | |
|---|---|---|---|
| 22 పర | పరమ గీతము | పరమగీతం | Song of Solomon |
| 23 యెష | యెషయా గ్రంథము | యెషయా | Isaiah |
| 24 యిర్మీ | యిర్మీయా | యిర్మియా | Jeremiah |
| 25 విలా | విలాప వాక్యములు | విలాపం | Lamentations |
| 26 యెహె | యెహెజ్కేలు | యెహెజ్కేలు | Ezakiel |
| 27 దాని | దానియేలు | దానియేలు | Daniel |
| 28 హోషే | హోషేయ | హోషేయ | Hosea |
| 29 యోవే | యోవేలు | యోవేలు | Joes |
| 30 ఆమో | ఆమోసు | ఆమోసు | Amos |
| 31 ఓబ | ఓబద్యా | ఓబద్యా | Obadiah |
| 32 యోనా | యోనా | యోనా | Janah |
| 33 మీకా | మీకా | మీకా | Mikah |
| 34 నహూ | నహూము | నహూము | Nahum |
| 35 హబ | హబక్కూకు | హబక్కూకు | Habakkuk |
| 36 జెఫ | జెఫన్యా | జెఫన్యా | Zephaniah |
| 37 హగ్గ | హగ్గయి | హగ్గయి | Haggai |
| 38 జెక | | జెకర్యా | Zechariah |
| 39 మలా | మలాకీ | మలాకీ | Malachi |
| 40 మత్త | మత్తయి సువార్త | మత్తయి శుభవార్త | Matthew |
| 41 మార్కు | మార్కు సువార్త | మార్కు శుభవార్త | Mark |
| 42 లూకా | లూకా సువార్త | లూకా శుభవార్త | Luke |
| 43 యోహా | యోహాను సువార్త | యోహాను శుభవార్త | John |
| 44 అపో | అపొస్తలుల కార్యాలు | క్రీస్తురాయబారుల చర్యలు | The acts |
| 45 రోమీ | రోమీయులకు | రోమ్ వారికి లేఖ | To the Romans |
| 46 1 కొరిం | 1 కొరింథీయులకు | కొరింతువారికి లేఖ-1 | 1 Corinthians |
| 47 2 కొరిం | 2 కొరింథీయులకు | కొరింతువారికి లేఖ-2 | 2 Corinthians |
| 48 గల | గలతీయులకు | గలతీయవారికి లేఖ | Galatians |
| 49 ఎఫె | ఎఫెసీయులకు | ఎఫెసువారికి లేఖ | Ephesians |
| 50 ఫిలి | ఫిలిప్పీయులకు | ఫిలిప్పీవారికి లేఖ | Philippians |

| | | | | |
|---|---|---|---|---|
| 51 | కొలొ | కొలొస్సయులకు | కొలస్సయివారికి లేఖ | Colossians |
| 52 | 1 థెస్స | 1 థెస్సలోనీకయులకు | తెస్సలోనీకవారికిలేఖ 1 | 1 Thessaloni-ans |
| 53 | 2 థెస్స | 2 థెస్సలోనీకయులకు | తెస్సలోనీకవారికిలేఖ-2 | 2 Thessalo-nians |
| 54 | 1 తిమో | 1 తిమోతికి | తిమోతికి లేఖ-1 | 1 Timothy |
| 55 | 2 తిమో | 2 తిమోతికి | తిమోతికి లేఖ-2 | 2 Timothy |
| 56 | తీతు | తీతుకు | టైటస్‌కు లేఖ | Titus |
| 57 | ఫిలే | ఫిలేమోనుకు | ఫిలేమోనుకు లేఖ | Philemon |
| 58 | హెబ్రీ | హెబ్రీయులకు | హీబ్రూవారికి లేఖ | To the Hebrews |
| 59 | యాకో | యాకోబు | యాకోబులేఖ | Epistle of James |
| 60 | 1 పేతు | 1 పేతురు | పేతురు లేఖ-1 | 1 Peter |
| 61 | 2 పేతు | 2 పేతురు | పేతురు లేఖ-2 | 2 Peter |
| 62 | 1 యోహా | 1 యోహాను | యోహాను లేఖ-1 | 1 John |
| 63 | 2 యోహా | 2 యోహాను | యోహాను లేఖ-2 | 2 John |
| 64 | 3 యోహా | 3 యోహాను | యోహాను లేఖ-3 | 3 John |
| 65 | యూదా | యూదా | యూదా లేఖ | Jude |
| 66 | ప్రక | ప్రకటన గ్రంథము | ప్రత్యక్షం | Revelation |

---

గమనిక : బైబిలులో పరస్పర వైరుధ్యాలు చాల కనిపిస్తాయి. అవి ఈ పుస్తకంలో ఎదురెదురుగా పొందు పరచబడ్డాయి. చదువరుల సౌకర్యార్థం స్పష్టంగా వైరుధ్యాన్ని పట్టి ఇచ్చే భాగాలను అండర్‌లైన్ చెయ్యడం జరిగింది.

# బైబిలు దర్శిని

## 1. అసంబద్ధాలు

అయితే మంచి చెడ్డల తెలివినిచ్చు వృక్షఫలములను తినవద్దు. నీవు వాటిని తిను దినమున నిశ్చయముగా చచ్చెదవని నరుని కాజ్ఞాపించెను.

ఆది 2 : 17.

ఆదాము బ్రతికిన దినములన్నియు తొమ్మిది వందల ముప్పది యేండ్లు. అప్పుడతడు మృతి బొందెను.

ఆది 5 : 5.

దేవుడు ఆయా జాతుల ప్రకారము అడవి జంతువులను, ఆయా జాతుల ప్రకారము పశువులను, ఆయా జాతుల ప్రకారము నేలను ప్రాకు ప్రతి పురుగును చేసెను. అది మంచిదని దేవుడు చూచెను. దేవుడు — మన స్వరూపమందు నరులను చేయుదము (అని పలికెను)

ఆది. 1 : 25:26.

జంతువుల సృష్టి ముందా ?
మానవుల సృష్టి ముందా ?

మరియు దేవుడైన యెహోవా నరుడు ఒంటరిగా నుండుట మంచిదికాదు. వానికి సాటియైన సహాయమును వానికొరకు చేయుదునను కొనెను. దేవుడైన యెహోవా ప్రతి భూ జంతువును ప్రతి ఆకాశపక్షిని నేల నుండి నిర్మించి ఆదాము వాటికి ఏ పేరు పెట్టునో చూచుటకు అతని యొద్దకు వాటిని రప్పించెను.... అయినను ఆదామునకు సాటియైన సహాయము అతనికి లేకపోయెను.

ఆది 2 : 18_20.

అర్పక్షదు ముప్పది యైదేండ్లు బ్రదికి షేలహును కనెను.

ఆది 11 : 12.

షేలహు కేయినానుకు, కేయినాను అర్పక్షదుకు, అర్పక్షదు షేముకు పుట్టెను. లూకా 3:36.

మరియు నీతోకూడ వాటిని బ్రదికించి యుంచుకొనుటకు సమస్త జీవులలో, అనగా సమస్త శరీరుల యొక్క ప్రతి జాతిలోనివి రెండేసి చొప్పున నీవు ఓడ లోనికి తేవలెను.

ఆది 6 : 19.

పవిత్ర జంతువులలో ప్రతి జాతి పోతులు ఏడును పెంటులు ఏడును .... నీవు భూమి అంతటిమీద సంతతిని జీవముతో కాపాడునట్లు నీ యొద్ద ఉంచు కొనుము.

ఆది 7 : 23.

దేవుడు నోవహునకు ఆజ్ఞాపించిన ప్రకారము పవిత్ర జంతువులలోను, అప విత్ర జంతువులలోను, పక్షులలోను, నేలను ప్రాకు వాటన్నిటిలోను, మగది ఆడుది జతలు జతలుగా ఓడలోనున్న నోవహు నొద్దకు చేరెను .... జీవాత్మగల సమస్త శరీరులలో రెండేసి రెండేసి ఓడలోనున్న నోవహు నొద్ద ప్రవే శించెను.

ఆది 7:8,9,14,15.

అబ్రాహాము ఆ చోటికి యెహోవా యీరే అను పేరు పెట్టెను. అందుచేత యెహోవా పర్వతము మీదచూచుకొనును అని నేటివరకు చెప్పబడును.

ఆది 22 : 14.

(పాత నిబంధనలో "దేవుడు" అనేమాట ఎల్లప్పుడు "యెహోవా" కు మారుగానే ఉపయోగించబడినది. ఆది 2 : 4 వగైరా చూడండి)

మరియు దేవుడు మోషేతో ఇట్లనెను. నేనే యెహోవాను. నేను సర్వశక్తి గల దేవుడను పేరున అబ్రాహాము ఇస్సాకు యాకోబులకు ప్రత్యక్షమైతిని కాని, యెహోవా అను నా నామమున నేను వారికి తెలియబడలేదు.

నిర్గ 6 : 2, 3.

తెరహు డెబ్బదియేండ్లు బ్రదికి అబ్రాముసు, నాహోరును, హారానును కనెను, ....తెరహు బ్రదికిన దినములు రెండు వందల యైదేండ్లు. తెరహు హారానులో మృతిబొందెను.

ఆది 11 : 26, 32.

అబ్రాము హారాను నుండి బయలు దేరినప్పుడు డెబ్బది యైదేండ్ల యీడు గలవాడు.

ఆది 12 : 4.

(అపొ 7 : 4 ప్రకారము అబ్రాము అతని తండ్రి మరణించిన తర్వాత హారాను నుండి బయలుదేరాడు. అంటే 135 యేండ్లు బ్రతికిన తర్వాత అబ్రాము వయస్సు 75 యేండ్లన్న మాట!)

అబ్రాహాము శోధింపబడి విశ్వాసము బటి ఇస్సాకును బలిగా అర్పించెను.

హెబ్రీ 11 : 17.

(ఇంగ్లీషు బైబిలు, తెలుగు వాడుక భాషలోని పవిత్ర గ్రంథాల ప్రకారం "ఒక్కగానొక్క కొడుకైన ఇస్సాకును" అని ఉండాలి - అను)

దాసి వలన ఒకడును స్వతంత్రురాలి వలన ఒకడును ఇద్దరు కుమారులు అబ్రాహామునకు కలిగిరని వ్రాయబడి ఉన్నది గదా ? గల 4 : 22.

(ఆది 16 : 15 కూడా చూడండి)

అబ్రాహాము మరల ఒక స్త్రీని వివాహము చేసికొనెను, ఆమె పేరు కెతూరా.

ఆది 25 : 1.

అబ్రాహాము యొక్క ఉప పత్నియైన కెతూరా కనిన కుమారులు ఎవరనగా జిమ్రాను, యొక్షాను.

1 దిన 1 :

నీకును నీతరువాత నీ సంతతికిని.... కనాను దేశ మంతటిని నిత్య స్వాస్థ్యముగా ఇచ్చెదను.

ఆది 17 : 8.

(అబ్రాహాముతో దేవుడు చెప్పిన మాటలివి)

అయన ఇందులో అతనికి పాదము పట్టునంత భూమినైనను ఇయ్యక ....

అపొ 7 : 5.

విశ్వాసమునుబట్టి అతడును, అతనితో ఆ వాగ్దానమునకు సమాన వారసులైన

ఇస్సాకు యాకోబు అనువారును ....
.... ఆవాగ్దాన ఫలము అనుభవింపక
పోయినను .... విశ్వాసము గలవారై
మృతి బొందిరి.

హెబ్రీ 11 : 9, 13

యాకోబు కోడంద్రను వినాయించి అతని గర్భవాసమున పుట్టి యాకోబుతో ఐగుప్తునకు వచ్చిన వారందరు అరువది ఆరుగురు. ఐగుప్తులో అతనికి పుట్టిన యోసేపు కుమారు లిద్దరు; ఐగుప్తునకు వచ్చిన యాకోబు కుటుంబపు వారందరు డెబ్బది మంది.

ఆది 46 : 26, 27.

యోసేపు తన తండ్రియైన యాకోబును తనస్వజనులందరిని పిలువనంపెను వారు డెబ్బది యయిదుగురు.

అపొ 7 : 14

యాకోబు గర్భమున పుట్టిన వారందరు డెబ్బదిమంది. అప్పటికియోసేపు ఐగుప్తులో ఉండెను.

నిర్గ 1 5.

అతని కుమారులు కనాను దేశమునకు అతని శవమును తీసికొనిపోయి మక్పేలా పొలమందున్న గుహలో పాతిపెట్టిరి. దానిని ఆ పొలమును అబ్రాహాము తనకు శ్మశానము కొరకు స్వాస్థ్యముగా నుండు నిమిత్తము మమ్రేయెదుట హిత్తీయుడైన ఎఫ్రోనుయొద్ద కొనెను.

ఆది 50 : 13.

యాకోబు ఐగుప్తునకు వెళ్లెను; అక్కడ అతడును మన పితురులును చనిపోయి అక్కడినుండి షెకెమునకు తేబడి, షెకెములోని హమోరు కుమారుల యొద్ద అబ్రాహాము వెల యిచ్చి కొనిన సమాధిలో ఉంచబడిరి.

అపొ 7 : 15, 16.

ఇశ్రాయేలీయులు ఐగుప్తులో నివసించిన కాలము నాలుగు వందల ముప్పది సంవత్సరములు.

నిర్గ 12 40

అయితే దేవుడు అతని సంతానము అన్యదేశమందు పరవాసులగుదురనియు, ఆదేశస్థులు నన్నూరు (నాలుగు వందల) సంవత్సరముల మట్టుకు వారిని దాస్యము

అబ్రాహామునకును అతని సంతానము నకును వాగ్దానములు చేయబడెను .... నాలుగు వందల ముప్పది సంవత్సరము లైన తరువాత వచ్చిన ధర్మశాస్త్రము .... దేవునిచేత స్థిరపరచబడిన నిబంధన....

గల 3 : 16, 17

నకు లోపరచుకొని బాధపెట్టుదురనియు చెప్పెను.

అపొ 7 : 6.

(అబ్రాహాము రమ్మని కోరిన 215 సం.ల తర్వాతనే యాకోబు అతని సంతతి ఐగుప్తుకు వచ్చారు [అబ్రాహాము మరణించిన 112 సం.లకు] కాబట్టి ఇశ్రాయేలీయులు ఐగుప్తులో 215 సం.లకు మించి బాధలు అనుభవించి ఉండరు)

ఇరువది నాలుగు వేలమంది ఆ తెగులు చేత చనిపోయిరి.

సంఖ్యా 25 : 9.

మరియు వారివలె మనము వ్యభిచరింపక యుందము. వారిలో కొందరు వ్యభిచరించి నందున ఒక్క దినముననే ఇరువది మూడు వేలమంది కూలిరి.

1 కొరిం 10 : 8.

కాదేషులో నుండి బయలుదేరి ఎదోము దేశము కడనున్న హోరుకొండ దగ్గరదిగిరి. యెహోవా సెలవిచ్చిన ప్రకారము యాజకుడైన అహరోను హోరు కొండ నెక్కి.... అక్కడ మృతిబొందెను ....వారు హోరు కొండనుండి బయలుదేరి సల్మానాలో దిగిరి. సల్మానాలో నుండి బయలుదేరి పూనానులో దిగిరి.

సం॥ 37-42.

ఇశ్రాయేలీయులు యహకానీయులదైన బెయేరోతునుండి బయలుదేరి మోసేరుకు వచ్చి నప్పుడు అక్కడ అహరోను చని పోయి పాతిపెట్టబడెను. అతని కుమారుడైన ఎలియాజరు అతనికి ప్రతిగా యాజకుడాయెను. అక్కడ నుండి వారు గుద్గోదకును గుద్గోదనుండి నీటి వాగులు గల దేశమైన యొత్బాతాకును ప్రయాణము చేసిరి.

ద్వితీ 10 : 6, 7.

దేవుడు ఈ ఆజ్ఞలన్నియు వివరించి చెప్పెను .... ఏడవదినము నీ దేవుడైన యెహోవాకు విశ్రాంతి దినము. దానిలో

యెహోవా ఆ కొండమీద అగ్నిమధ్య నుండి ముఖాముఖిగా మీతో....ఈలాగున సెలవిచ్చెను .... ఏడవదినము నీ దేవు

నీవు....ఏ పనియు చేయకూడదు. ఆరు దినములలో యెహోవా ఆకాశమును భూమియు సముద్రమును వాటిలోని సమస్తమును సృజించి, యేడవ దినమున విశ్రమించెను. అందుచేత యెహోవా విశ్రాంతి దినమును ఆశీర్వదించి దాని పరిశుద్ధ పరచెను.

నిర్గ 20:1,10,11

ఇది మీ తరతరములకు మీ నివాస స్థలము లన్నిటిలో నిత్యమైనకట్టడ.

లేవీ 23 : 14.

(లేవీ 23 : 21,31,41 కూడ చూడండి)

పరహత్య చేయకూడదు.

నిర్గ 20 - 13.

మోషేభూమి మీదనున్న వారందరిలో మిక్కిలి సాత్వికుడు.

సంఖ్యా 12 : 3.

దైన యెహోవాకు విశ్రాంతి దినము. దానిలో నీవు .. ఏ పనియు చేయకూడదు. నీవు ఐగుప్తుదేశమందు దాసుడవైయున్నపుడు నీ దేవుడైన యెహోవా బాహుబలముచేతను చాచిన చేతి చేతను నిన్ను అక్కడనుండి రప్పించెనని జ్ఞాపకముచేసి కొనుము. అందుచేతను విశ్రాంతిదినము ఆచరింపవలెనని నీ దేవుడైన యెహోవా నీకు ఆజ్ఞాపించెను.

ద్వితీ 5 : 4,5,14,15

ధర్మశాస్త్రమునుండి విడుదల పొంది

రోమి 7 : 6.

అతడు వారిని చూచి — మీలో వాడును తన కత్తిని తన నడుమున కట్టుకొని పాళెములో ద్వారము నుండి ద్వారమునకు వెళ్ళుచు, ప్రతివాడు తన సహోదరుని ప్రతివాడు తన చెలికానిని ప్రతివాడు తన పొరుగు వానిని చంపవలెనని ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా సెలవిచ్చు చున్నాడనెను.

నిర్గ 32 : 27.

మోషే .... సేనానాయకుల మీద కోపపడెను....వారితో — మీరు ఆడువారి నందరిని బ్రదుక నిచ్చితిరా? .... మీరు

పిల్లలలో ప్రతి మగవానిని పురుష సంయోగము ఎరిగిన ప్రతి స్త్రీని చంపుడి పురుష సంయోగము ఎరుగని ప్రతి ఆడు పిల్లను మీ నిమిత్తము బ్రదుకనీయుడి (అనెను)

సంఖ్యా 31:14 15,17,18.

అయితే ఇశ్రాయేలీయులు ఐగుప్తు దేశములోనుండి బయలుదేరి వచ్చిన నాలుగు వందల ఎనుబది యవ సంవత్సరమందు, అనగా సొలొమోను ఇశ్రాయేలును ఏలిన నాలుగవ సంవత్సరమందు జీప్ అనురెండవ మాసమున అతడు యెహోవా మందిరమును కట్టింప నారంభించెను.

1 రాజు 6 : 1.

ఇది పౌలు లెక్కించిన జాబితా ప్రకారం ఇశ్రాయేలీయులు ఐగుప్తుదేశమునుండి బయలు దేరి వచ్చిన 595 వ సంవత్సరం అయిఉండాలి. 40 + 450 + 21(సమూయేలు పరిపాలన) + 40 (సౌలు పరిపాలన) + 40 (దావీదు పరిపాలన) + 4 = 595]

ఇంచుమించు నలువది ఏండ్లమట్టుకు వారి చేష్టలను సహించెను .... ఇంచుమించు నాలుగు వందల ఏబది సంవత్సరములు ఇట్లు జరిగెను. అటు తరువాత ప్రవక్తయైన సమూయేలు వరకు ఆయన వారికి న్యాయాధిపతులను దయచేసెను. ఆ తరువాత వారు రాజు కావలెనని కోరగా దేవుడు బెన్యామీను గోత్రీయుడును కీషు కుమారుడునైన సౌలును వారికి నలువది ఏండ్లవరకు దయచేసెను. తరువాత అతనిని తొలగించి దావీదును వారికి రాజుగా ఏర్పరచెను.

అపొ 13 : 18, 20-22.

యెహోవా ఆత్మ అతని మీదికి మరల రాగా అతడు అష్కెలోనుకు పోయి వారిలో ముప్పది మందిని చంపి వారి సొమ్మును దోచుకొనెను.

న్యాయా 14 : 19.

ఆత్మఫలమేమనగా, ప్రేమ, సంతోషము, సమాధానము, దీర్ఘశాంతము, దయాళుత్వము, మంచితనము, విశ్వాసము సాత్వికము, ఆశానిగ్రహము.

గల. 5 : 22.

సౌలు ఫిలిష్తీయుల దండును చూచి మనస్సునందు భయకంపము నొంది యెహోవా యొద్ద విచారణ చేయగా యెహోవా స్వప్నముద్వారానైనను, ఊరీము ద్వారానైనను, ప్రవక్తల ద్వారా నైనను, ఏమియు సెలవియ్యకుండెను.

1 సమూ 28 : 6.

యెహోవాయొద్ద విచారణ చేయక కర్ణపిశాచములయొద్ద విచారణ చేయు దానిని వెదకి నందుకును సౌలు హత మాయెను. అందు నిమిత్తము యెహోవా అతనికి మరణశిక్ష విధించి రాజ్యమును యెష్షయి కుమారుడైన దావీదు వశము చేసెను.

1 దిన 10:13,14.

యెష్షయి తన ఏడుగురు కుమారులను సమూయేలుఎదుటికి పిలువగా సమూయేలు-యెహోవా వీరిని కోరుకొనలేదని చెప్పి నీ కుమారులందరు ఇక్కడనున్నారా అని యెష్షయిని అడుగగా అతడు - ఇంకను కడసారివాడున్నాడు, అయితే వాడుగొఱ్ఱెలను కాయుచున్నాడని చెప్పెను.

1 సమూ 16:10,11.

యెష్షయి తన జ్యేష్ఠ కుమారుడైన ఏలీయాబును, రెండవవాడైన అబీనాదాబును, మూడవవాడైన షమ్మాను,నాలుగవవాడైన నెతనేలును, అయిదవవాడైన రద్దయిని, ఆరవవాడైన ఓజెమును, ఏడవవాడైన దావీదును కనెను.

I దిన 2 : 13 — 15.

సౌలు - యెష్షయి యొద్దకు దూతలను పంపి, గొఱ్ఱెల యొద్దనున్న నీ కుమారుడైన దావీదును నా యొద్దకు పంపుమనెను. ....దావీదు సౌలు దగ్గరకు వచ్చి అతని యెదుట నిలువబడగా అతనియందు సౌలునకు బహు ఇష్టము పుట్టెను. అతడు సౌలు ఆయుధములను మోయువాడాయెను. అంతట సౌలు - దావీదు నా అనుగ్రహము పొందెను గనుక అతడు నా సముఖమందు సేవచేయుటకు ఒప్పుకొనుమని యెష్షయికి వర్తమానము పంపెను. 1సమూ 16:19,21,22

సౌలు దావీదు ఫిలిష్తీయునికి ఎదురుగా పోవుట చూచినప్పుడుతన సైన్యాధిపతియైన అబ్నేరును పిలిచి- అబ్నేరూ, ఈ యౌవనుడు ఎవని కుమారుడని అడుగగా అబ్నేరు - రాజా నీ ప్రాణముతోడు నాకు తెలియదనెను. అందుకు రాజు - ఈ పడుచు వాడు ఎవని కుమారుడో అడిగి తెలిసికొమ్మని అతనికి ఆజ్ఞ ఇచ్చెను.

1 సమూ 17 : 55,56

గాతువాడైన గొల్యాతు అను శూరుడొకడు ఫిలిష్తీయుల దండులో నుండి బయలుదేరుచుండెను, అతడు ఆరు మూళ్ళజేనెడు ఎత్తు మనిషి ... అతని యీటె కఱ్ఱ నేతగాని దోనె అంతపెద్దది .... దావీదు ఫిలిష్తీయుని కంటె బలాఢ్యుడై .... వడిసెలతోను రాతితోను ఆ ఫిలిష్తీయుని కొట్టి చంపెను.

1 సమూ 17:4,7,50

బేత్లెహేమీయుడైన యెహరేయోరెగీము కుమారుడగు ఎల్హానాను గిత్తీయుడైన గొల్యాతు సహోదరుని చంపెను. వాని యీటె కఱ్ఱ నేతగాని దోనె అంత గొప్పది.

(రివైజ్డ్ వెర్షన్) 2 సమూ 21 : 19.

[గాతువాడు, గిత్తీయుడు అనే రెండు పదాలు ఒక రూపమే. వ్యతిరేక భావాన్ని తొలగించడానికి గాను ఆథరైజ్డ్ వెర్షన్‌లో "సహోదరుని" అని చొప్పించారు.]

(తెలుగు వాడుక భాషలో వున్న పవిత్ర గ్రంథం ప్రకారం చంపినవాడు ఎల్హానాను, చచ్చినవాడు గొల్యాతు — అను)

వారు నాకోను కళ్ళము దగ్గరకువచ్చినప్పుడు ఎడ్లకు కాలుజారినందున ఉజ్జాచేయి చాపి దేవుని మందసమును పట్టుకొనెను.

2 సమూ 6 : 6.

వారు కీదోను కళ్లము నొద్దకు వచ్చినప్పుడు ఎడ్లకు కాలు జారినందున మందసమును పట్టుకొనవలెనని చేయి చాపెను. 1 దిన 13 : 9.

అతనియొద్దనుండి దావీదు వెయ్యిన్ని యేడువందల మంది గుఱ్ఱపు రౌతులను ఇరువదివేల కాల్బలమును పట్టుకొనెను

2 సమూ 8:4.

దావీదు అతని యొద్ద నుండి వెయ్యి రథములను ఏడువేల గుఱ్ఱపు రౌతులను ఇరువదివేల కాల్బలమును పట్టుకొనెను.

1 దిన 18 : 4.

సిరియనులు సన్నద్ధులై దావీదును ఎదుర్కొనవచ్చి అతనితో యుద్ధముకలిపి ఇశ్రాయేలీయుల ఎదుట నిలువజాలక పారిపోగా, దావీదు సిరియనులలో ఏడు వందలమంది రథికులను నలువది వేలమంది గుఱ్ఱపు రౌతులను హతము

అయితే సిరియనులు ఇశ్రాయేలీయుల యెదుట నిలువక తిరిగి పారిపోయిరి. దావీదు సిరియనులలో ఏడు వేల రథికులను నలుబది వేల కాల్బలమును హతముచేసి సైన్యాధిపతియైన షోపకును చంపివేసెను. 1 దిన 19:18.

చేసెను. మరియు వారి సైన్యాధిపతియగు షోబకు దావీదు చేతిలో ఓడిపోయి అచ్చటనే చచ్చెను. 2 సమూ 10: 8

తరువాత సాతాను ఇశ్రాయేలునకు విరోధముగా లేచి, ఇశ్రాయేలీయులను లెక్కించుటకు దావీదును ప్రేరేపించెను. 1 దిన 21:1

ఇంకొకమారు యెహోవా కోపము ఇశ్రాయేలీయుల మీద రగులు కొనగా ఆయన దావీదును వారి మీదికి ప్రేరేపణచేసి – నీవు పోయి ఇశ్రాయేలు వారిని యూదా వారిని లెక్కించుమని ఆజ్ఞ ఇచ్చెను. 2 సమూ 24:1.

అప్పుడు యోవాబు జనసంఖ్య వెరసి రాజునకు అప్పగించెను. ఇశ్రాయేలు వారిలో కత్తిదూయగల యెనిమిది లక్షల మంది యోధులుండిరి. యూదా వారిలో అయిదు లక్షల మంది యుండిరి. 2 సమూ 2 : 9.

యోవాబు ఇశ్రాయేలు దేశ మందంతట సంచరించి తిరిగి యెరూషలేమునకు వచ్చి జనుల సంఖ్య వెరసి దావీదునకు అప్పగించెను. ఇశ్రాయేలీయు లందరిలో కత్తి దూయువారు పదకొండు లక్షల మందియు యూదా వారిలో కత్తిదూయు వారు నాలుగులక్షల డెబ్బదివేలమందియు సంఖ్యకు వచ్చిరి. రాజుమాట యోవాబునకు అసహ్యముగా ఉండెను గనుక అతడు లేవి బెన్యామీను గోత్ర సంబంధులను ఆ సంఖ్యలో చేర్చలేదు. 1 దిన 21 : 4-6.

రాజు — నేను అలాగు తీసికొనను, వెలయిచ్చి నీ యొద్దకొందును, వెలయియ్యక నేను తీసికొనిన దానిని నాదేవుడైన యెహోవాకు దహన బలిగా అర్పించనని అరౌనాతో చెప్పి ఆకళ్లమును ఎడ్లను ఏబది తులముల వెండికి కొనెను. 2 సమూ 2 :24.

రాజైన దావీదు .... న్యాయమైన క్రయ ధన మిచ్చి దాని తీసికొందునని ఒర్నానుతో చెప్పి ఆ భూమికి ఆరు వందల తులముల బంగారమును అతనికిచ్చెను. 1 దిన 21:24,25.

గాదు దావీదు నొద్దకు వచ్చి యిట్లని సంగతి తెలియజెప్పెను - నీవు నీ దేశమందు ఏడు సంవత్సరములు క్షామము కలుగుటకు ఒప్పుకొందువా? నిన్నుతరుము చున్న నీ శత్రువుల యెదుట నిలువ లేక నీవు మూడు నెలలు పారిపోవుటకు ఒప్పుకొందువా? నీ దేశమందు మూడు దినములు తెగులు రేగుటకు ఒప్పుకొందువా? 2 సమూ 24:13.

దావీదునకు అనుగ్రహించిన పవిత్రమైన వరములను మీకనుగ్రహింతును. అపొ 13 : 34.

గాదు దావీదునొద్దకు వచ్చియిట్లనెను- మూడేండ్లపాటు కరువు కలుగుటమూడు నెలలపాటు నీ శత్రువులు కత్తిదూసి నిన్ను తరుమగా నీవు వారి యెదుట నిలవలేక నశించిపోవుట, మూడు దినముల పాటు దేశమందు యెహోవా కత్తి అనగా తెగులు నిలుచుటచేత యెహోవా దూత ఇశ్రాయేలీయుల దేశమందంతట నాశనము కలుగ జేయుట అనువీటిలో ఒకదానిని నీవు కోరుకొనుము. 1 దిన 21 : 11,12.

దాని యందున్న జనులను అతడు వెలుపలికి కొనిపోయి వారిలో కొందరిని రంపములతో కోయించెను. కొందరిని ఇనుప దంతెలతో చీరించెను; కొందరిని గొడ్డళ్లతో నరికించెను. ఈ ప్రకారము అతడు అమ్మోనీయుల పట్టణము లన్నిటికిని చేసెను, అంతట దావీదును జనులందరును యెరూషలేమునకు తిరిగి వచ్చిరి. 1 దిన 20 : 3.

పట్టణములో వున్నవారిని బయటికి తెప్పించి రంపముల చేతను, పదును గల యినుప పనిముట్ల చేతను, ఇనుప గొడ్డండ్ల చేతను వారిని తుత్తునియలుగా చేయించి వారిని యిటుక ఆవములో వేసెను. అమ్మోనీయుల పట్టణములన్నిటికిని అతడు ఈలాగు చేసెను ఆ

తరువాత దావీదును జనులందరును తిరిగి యెరూషలేమునకు వచ్చిరి.

2 సమూ 12 : 31.

యెహోవా మార్గములను నేను అనుసరించుచున్నాను. భక్తిహీనుడనై నా దేవుని విడిచిన వాడనుకాను. ఆయన న్యాయ విధుల నన్నిటిని నేను లక్షపెట్టుచున్నాను. ఆయన కట్టడలను త్రోసివేసిన వాడనుకాను. దోషక్రియలు చేయనొల్లకుంటిని. ఆయన దృష్టికి యదార్థుడనై తిని.

2సమూ 22:22-24, కీర్త 18:21-23

నా బాల్య పాపములను నా అతిక్రమములను జ్ఞాపకము చేసి కొనకుము. యెహోవా నీ కృపను బట్టి నీ దయ చొప్పున నన్ను జ్ఞాపకములో ఉంచుకొనుము. కీర్త 25 : 7.

దావీదు హిత్తీయుడైన ఊరియా సంగతియందు తప్ప తన జీవితదినములన్నియు యెహోవా దృష్టికి యథార్థముగా నడుచుకొనుచు, యెహోవా అతనికిచ్చిన ఆజ్ఞలలో దేని విషయమందును తప్పిపోకుండెను. 1 రాజు 15 : 4

నా దోషములు నన్ను తరిమి పట్టుకొనగా నేను తలయెత్తి చూడలేకపోతిని. కీర్త 40 : 12.

నా పాపములను బట్టి నా యెముకలలో స్వస్థత లేదు. నా దోషములు నా తల మీదుగా పొరిపోయినవి. నేను మోయలేని బరువు వలె అవి నా మీద మోపబడియున్నవి. కీర్త 38 : 3, 4

మరణము వరకు సౌలు కుమారెయగు మీకాలు పిల్లలను కనకయుండెను.

2 సమూ 6 : 23.

సౌలు కుమారెయగు మెరాబు (మీకాలు) మెహూలాతీయుడగు బర్జిల్లయి కుమారుడైన అద్రీయేలునకు కనిన అయిదుగురు కుమారులను పట్టుకొని గిబియోనీయుల కప్పగించెను.

2 సమూ 21 : 8.

(ఇంగ్లీషు బైబిలులో "సౌలు కుమార్తె మీకాలు" అని ఉండగా పరిశుద్ధ గ్రంథములో "మేరాబు (మీకాలు)" అనీ, పవిత్ర గ్రంథంలో "మెరాబు' అని యివ్వడాన్ని బట్టి ఈ అసంబద్ధాన్ని నివారించడానికి ప్రయత్నం జరుగుతున్నదని అర్థమవుతున్నది. ఇంగ్లీషు బైబిలు రివైజ్డ్ వెర్షన్‌లో bear కు బదులు brought up అని సవరించడం కూడ జరిగింది—అను)

సొలొమోను రథములకు నలువది వేల గుఱ్ఱపు శాలలును రౌతులకు పండ్రెండువేల గుఱ్ఱములును ఉండెను.
1 రాజు 4 : 26

సొలొమోనునకు నాలుగువేల గుఱ్ఱపు శాలలును రథములును పండ్రెండువేల గుఱ్ఱపు రౌతులును కలిగియుండెను.
2 దిన 9 : 25.

ఏమనగా అతడు రెండు ఇత్తడి స్తంభములు పోతపోసెను. ఒక్కొక్క స్తంభము పదునెనిమిది మూరల నిడివి గలది, ఒక్కొక్క పండ్రెండు మూరల కైవారము గలది .... ఈ స్తంభములను అతడు పరిశుద్ధ స్థలపు మంటపములో ఎత్తించెను. కుడిపార్శ్వపు స్తంభమును ఎత్తి దానికి యాకీను అని పేరు పెట్టెను, ఎడమ పార్శ్వపు స్తంభమును ఎత్తిదానికి బోయజు అను పేరు పెట్టెను.
1 రాజు 7:15,21.

మందిరము ముందర ఉండుటకై ముప్పది యైదుమూరల ఎత్తుగల రెండు స్తంభములను, వాటి మీదికి అయిదు మూరల ఎత్తుగల పీటలను చేయించెను.... ఆ రెండు స్తంభములను దేవాలయము ఎదుట కుడి తట్టున ఒకటియు ఎడమ తట్టున ఒకటియు నిలువ బెట్టించి కుడి తట్టుదానికి యాకీను అనియు, ఎడమ తట్టు దానికి బోయజు అనియు పేళ్లు పెట్టెను. 2 దిన 3 : 15, 17.

మరియు పోతపనితో ఒక సముద్రమును చేసెను .... అది తొమ్మిది గరిసెలు పట్టును.
1 రాజు 7:23,26.

పోత పోసిన సముద్రపు తొట్టి యొకటి చేయించెను....అది ముప్పది తూముల నీళ్లు పట్టును. 2 దిన 4 : 2, 5.

జ్ఞానము సంపాదించుకొనుటయే జ్ఞానమునకు ముఖ్యాంశము. నీ సంపాదన అంతయుఇచ్చి బుద్ధిసంపాదించుకొనుము.
సామె 4 : 7.

జ్ఞానము సంపాదించినవాడు ధన్యుడు వివేచన కలిగిన నరుడు ధన్యుడు.
సామె 3 : 13.

నీతిమంతులు ఖర్జూర వృక్షము వలె మొవ్వ వేయుదురు. కీర్త 92 : 12

నీతిమంతునికి ఏ ఆపదయు సంభవింపదు. సామె 12 : 21.

భక్తిహీనుల ఆయుస్సు తక్కువై పోవును. సామె 10 : 27

రక్తాపరాధులును వంచలును సగకాలమైన బ్రదుకరు.
కీర్త 55 : 23.

ఇందు విషయమై ఇలా వ్రాయబడియున్నది. జ్ఞానుల జ్ఞానమును నాశనము చేతును. వివేకుల వివేకమును శూన్యపరతును 1 కొరిం 1 : 19

విస్తారమైన జ్ఞానాభ్యాసము చేత విస్తారమైన దుఃఖము కలుగును. అధిక విద్య సంపాదించిన వానికి అధిక శోకము కలుగును. ప్రసం 1 : 18.

నీతి మంతులు నశించుట చూచి ఎవరును దానిని మనస్సున పెట్టరు.
యెష 57 : 1.

సంభవించునవి అన్నియు నీతి మంతులకును దుష్టులకును ఏక రీతిగానే సంభవించును ప్రసం 9 : 2.

ప్రభువుతాను ప్రేమించు వానినిశిక్షించి తాను స్వీకరించు ప్రతి కుమారుని దండించును. హెబ్రీ 12 : 6

భక్తిహీనులు ఏల బ్రదుకుదురు? వారు వృద్ధులై బలాభివృద్ధి ఏల నొందుదురు? వారుండగానే వారితో కూడా వారి సంతానము వారు చూచుచుండగా వారి కుటుంబము స్థిరపరచ బడుచున్నది వారి కుటుంబములు భయమేమియు లేక

క్షేమముగా నున్నవి. దేవుని దండము వారి మీద పడుట లేదు. యోబు 21:7_9

భక్తిహీనుల దీపము ఆర్పివేయబడును. వారి అగ్నిజ్వాలలు ప్రకాశింపక పోవును .... నలుదిక్కుల భీకరమైనవి వారికి భయము కలుగజేయును .... జనులు వారిని వెలుగులోనుండి చీకటిలోనికి తోలుదురు. భూలోకములోనుండి వారిని తరుముదురు. వారి ప్రజలలో వారికి పుత్రులైనను పౌత్రులైనను ఉండరు. వారు నివసించిన స్థలములో తప్పించుకొనిన వాడు ఒక్కడైనను ఉండడు. యోబు 18:5,11,18, 9.

భక్తిహీనుల క్షేమము నా కంట బడినప్పుడు గర్వించు వారిని బట్టి నేను మత్సర పడితిని. మరణమందు వారికి యాతనలు లేవు. వారు పుష్టిగానున్నారు ఇతరులకు కలుగు ఇబ్బందులు వారికి కలుగవు. ఇతరులకు పుట్టినట్లు వారికి తెగులు పుట్టదు .... ఇదిగో ఇట్టివారు భక్తిహీనులు. వీరు ఎల్లప్పుడు నిశ్చింత గలవారై ధనవృద్ధి చేసికొందురు. కీర్త 73:3_5,12.

ప్రభువా నీవు మాత్రము పవిత్రుడవు నీకు భయపడని వాడెవడు? నీనామమును మహిమపరచని వాడెవ్వడు. ప్రక 15:4

నేను నీభక్తుడను నా ప్రాణము కాపాడుము. కీర్త 86:2.

(ఆంగ్ల అనువాదం ప్రకారం"నీభక్తుడను" అని ఉన్నచోట "నేను పవిత్రుడను" అని ఉండాలి.అను)

చచ్చిన వారు ఏమియు ఎరుగరు, వారిపేరు మరుపబడి యున్నది. వారికిక ఏ లాభమును కలుగదు. ప్రసం 9 : 5.

వీరు నిత్య శిక్షకును నీతిమంతులు నిత్య జీవమునకు పోవుదురు. మత 25 : 46.

ద్రాక్షారసము మిక్కిలి ఎఱ్ఱబడగను గిన్నెలో తళతళలాడు చుండగను త్రాగుటకు రుచిగా నుండగను దానివైపు చూడ

ఎద్దులకేమి గొఱ్ఱెలకేమి ద్రాక్ష రసమునకేమి మద్యమునకేమి నీవు కోరు దానికి ఆ వెండి నిచ్చి, అక్కడ నీ

కుము పిమ్మట అది సర్పము వలె కరచును. కట్లపాము వలె కాటు వేయును.

సామె 23:31,32.

ద్రాక్షారసము వెక్కిరింతల పాలు చేయును. మద్యము అల్లరి పుట్టించును. దాని వశమైన వారందరు జ్ఞానము లేని వారు. సామె 20 : 1.

యూదా రాజైన యెహోషాపాతు కుమారుడైన యెహోరాము ఏలుబడిలో రెండవ సంవత్సరమందు యెహోరాము (అహాబు కుమారుడు) అతనికి మారుగా రాజాయెను. 2 రాజు 1:17

రెహబాము తనభార్యలందరి కంటెను ఉపపత్నులందరి కంటెను అబ్షాలోము కుమార్తెయైన మయకాను ఎక్కువగా ప్రేమించెను. రెహబాము మయికాకు పుట్టిన కుమారుడైన అబియాను రాజును చేయతలచి, అతని సహోదరుల మీద ప్రధానునిగాను అధిపతినిగాను అతని నియమించెను.

2 దిన 11 : 21, 22.

దేవుడైన యెహోవా సన్నిధిని భోజనము చేసి నీవును నీ ఇంటివారును నీ ఇంటనుండు లేవీయులును సంతోషింపవలెను.

ద్వితీ 14 : 26.

ఆ ప్రకారమే భోజనమైన పిమ్మట ఆయన పాత్రను ఎత్తికొని - ఈ పాత్ర నా రక్తము వలననైన క్రొత్త నిబంధన. మీరు దీనిలోనిది త్రాగు నప్పుడెల్ల నన్ను జ్ఞాపకము చేసికొనుటకై దీనిని చేయుడని చెప్పెను. 1 కొరిం 11 : 25.

అహాబు కుమారుడును ఇశ్రాయేలు వారికి రాజునైన యెహోరాము ఏలుబడిలో అయిదవ సంవత్సర మందు యెహోషాపాతు యూదా రాజైయుండగా యూదా రాజైన యెహోషాపాతు కుమారుడైన యెహోరాము ఏల నారంభించెను. 2 రాజు 8 : 16.

రాజైన యెరొబాము ఏలుబడిలో పదునెనిమిదవ సంవత్సర మందు అబీయా యూదా వారి మీద ఏల నారంభించెను. అతడు మూడు సంవత్సరములు యెరూషలేము నందు ఏలెను. అతని తల్లి పేరు మీకాయా, ఆమె గిబియా ఊరి వాడైన

లు కుమార్తె.

2 దిన 13 : 1, 2.

మరియు ఆయుధస్థుల మీద నియమింపబడి యున్న అధిపతిని, పట్టణములో నుండి తీసికొని, రాజసముఖమును కని పెట్టుకుని యుండు వారిలో పట్టణమందు దొరికిన అయిదుగురిని పట్టుకొనెను,
2 రాజు 25:19.

ఆతడు పట్టణములో నుండి యోధుల మీద నియమింపబడిన ఒక ఉద్యోగస్థుని, పట్టణములో దొరికిన రాజసన్నిధిలో నిలుచు ఏడుగురు మనుష్యులను పట్టుకొనెను యిర్మీ 52 : 25.

యెహోయాకీను ఏల నారంభించి నప్పుడు ఎనిమిదేండ్లవాడై యెరూష లేములో మూడు నెలల పది దినములు ఏలెను. 2 దిన 36:9

(ఈ మధ్య తెలుగు వాడుక భాషలో తీసుకురాబడిన పవిత్రగంథం "యెహో యాకీను రాజయినప్పుడు పద్దెనిమిదేళ్ళ వాడు" అని మార్పుచేసి అనువదించారు- అను)

యెహోయా కీను ఏల నారంభించి నప్పుడు పదునెనిమిదేండ్లవాడై యెరూష లేమునందు మూడు మాసములు ఏలెను.
2 రాజు 4 : 8.

బయెషా తన పితురులతో కూడ నిద్రించి తిర్సాలో సమాధి చేయబడెను, అతనికి మారుగా అతని కుమారుడైన ఏలా రాజాయెను .... యూదా రాజైన ఆసా ఏలుబడిలో ఇరువదియారవ సంవత్సరమున బయెషా కుమారుడైన ఏలా తిర్సాయందు ఇశ్రాయేలు వారి నందరిని ఏలనారంభించెను. 1 రాజు 16.6,8.

ఆసా ఏలుబడి యందు ముప్పది ఆరవ సంవత్సరమున ఇశ్రాయేలు రాజైన బయెషా యూదా వారిమీద దండెత్తి బయలుదేరియూదా రాజైన ఆసా యొద్దకు రాకపోకలు జరుగకుండునట్లు రామాను కట్టించెను. 2 దిన 16 : ..

(అంటే బయెషా రామా పట్టణాన్ని తను చనిపోయిన పదేళ్లకు నిర్మించాడన్నమాట!)

అహజ్యా యేల నారంభించినప్పుడు ఇరువది రెండేడ్ల వాడైయుండి యెరూష

అహజ్యాయేల నారంభించినప్పుడు నలువది రెండేడ్లవాడై యెరూషలేములో

లేములో ఒక సంవత్సరము ఏలెను.

2 రాజు 8:26.

వ్యాధిచేత పేగులు పడిపోయి బహు వేదన నొందుచు అతను (యెహోరాము మరణమాయెను .... అతడు యేలనారంభించినప్పుడు ముప్పది రెండేడ్లవాడు. యెరూషలేములో ఎనిమిది సంవత్సరములు ఏలి చనిపోయెను....యెరూషలేము కాపురస్థులు అతని కడగొట్టు కుమారుడైన అహజ్యాను అతనికి బదులుగా రాజును చేసిరి.

2 దిన 21 : 19, 20; 22 : 1.

ఒక సంవత్సరము ఏలెను.

2 దిన 22 : 2

(యెహోరాము నలభైయేళ్ల వయస్సులో చనిపోగానే నలభై రెండేడ్ల వయస్సు గల అతని కొడుకు అహజ్యా అతనికి మారుగా రాజయ్యాడు. అంటే కొడుకు తండ్రి కన్న రెండేడ్లు పెద్ద వాడన్నమాట !)
[పై అసంబద్ధాన్ని నివారించడానికి పవిత్ర గ్రంథంలో "అహజ్యా రాజయి నప్పుడు అతడి వయస్సు ఇరవై రెండు సంవత్సరాలు (కొన్ని ప్రాచీన ప్రతులలో "నలభై రెండు" అని వ్రాసి వుంది)" అని అనువాదం చేశారు—అను]

దేవుడు తన ఒక్కడే కుమారుని లోకములోనికి పంపెను.

1 యోహా 4:9.

దైవ కుమారులు యెహోవా సన్నిధిని నిలుచుటకై వచ్చిన దినమొకటి తటస్థించెను. ఆ దినమున అపవాది యగు వాడు వారితో కలిసి వచ్చెను.

యోబు 1 : 6.

దేవుని కుమారులు నరుల కుమార్తెలు చక్కని వారని చూచి వారందరిలో తమకు మనస్సు వచ్చిన స్త్రీలను వివాహము చేసికొనిరి. ఆది 6 : 2.

యేసు హేలీ కుమారుడైన యోసేపు కుమారుడని యెంచబడెను.

లూకా 3:23.

యాకోబు మరియ భర్తయైన యోసేపును కనెను, ఆమె యందు క్రీస్తు అనబడిన యేసు పుట్టెను.

మత 1 : 16.

అతని (దావీదు) గర్భఫలములో నుండి అతని సింహాసనము మీద ఒకని

యేసు క్రీస్తు జనన విధ మెట్లనగా, ఆయన తల్లియైన మరియ యోసేపునకు

కూర్చుండ బెట్టుదును అని దేవుడుప్రమాణము చేసెను. అపొ 2:30.

ప్రదానము చేయబడిన తరువాత వారేకము కాక మునుపు ఆమె పరిశుద్ధాత్మ వలన గర్భవతిగా వుండెను. మత 1 : 18

యోహాను చెరపట్టబడిన తరువాత యేసు — కాలము సంపూర్ణమై యున్నది, దేవుని రాజ్యము సమీపించి యున్నది. మారు మనస్సు పొంది సువార్త నమ్ముడని చెప్పుచు, దేవుని సువార్త ప్రకటించుచు, గలిలయకు వచ్చెను.

మార్కు 1:14,15

(పేతురు, అంద్రెయ ఇంకా మార్పునొంది యుండలేదు) మార్కు 1:16-18,

అటు తరువాత యేసు తన శిష్యులతో కూడ యూదయ దేశమునకు వచ్చి అక్కడ వారితో కాలము గడుపుచు బాప్తిస్మమిచ్చును ఉండెను ... యోహాను కూడ అక్కడ బాప్తిస్మమిచ్చుచు వుండెను. యోహాను ఇంకను చెరసాలలో వేయబడి యుండలేదు.

యోహా 3 : 22 - 24.

(పేతురు, అంద్రెయ ఇంతకు ముందే మార్పు నొందారు, యోహా 1 : 40 - 42 చూడండి)

ఆ దినములలో యేసు గలిలయలోని నజరేతు నుండి వచ్చి యొర్దానులో యోహానుచేత బాప్తిస్మము పొందెను. వెంటనే ఆయన నీళ్ళలోనుండి ఒడ్డునకు వచ్చుచుండగా ఆకాశము చీల్చబడుటయు పరిశుద్ధాత్మ పావురమువలె తనమీదికి దిగి వచ్చుటయు చూచెను .... వెంటనే పరిశుద్ధాత్మ ఆయనను అరణ్యములోనికి త్రోసికొని పోయెను. ఆయన సాతాను చేత శోధింపబడుచు అరణ్యములో నలువది దినములు అడవి మృగములతో కూడ నుండెను.

మార్కు 1:9,10,12,13.

మూడవ దినమున (యేసు బాప్తిస్మము పొంది, అతని మీదికి పరిశుద్ధాత్మ పావురమువలె దిగిన తరువాత) గలిలయలోని కానా అను ఊరిలో ఒక వివాహము జరిగెను. యేసు తల్లి అక్కడ వుండెను. యేసును ఆయన శిష్యులును ఆ వివాహమునకు పిలువ బడిరి.

యోహా 2 : 1, 2.

ఆ సమయమున వారి సమాజమందిరములో అపవిత్రాత్మ పట్టిన మనుష్యుడొకడుండెను. వాడు _నజరేయుడగు యేసూ మాతో నీకేమి, మమ్మునశింప జేయుటకు వచ్చితివా? నీవెవడవో నాకు తెలియును, నీవు దేవుని పరిశుద్ధుడవుఅని కేకలు వేసెను.

మార్కు 1 : 23, 24.

ప్రియులారా అనేకులైన అబద్ధ ప్రవక్తలు లోకములోనికి బయలు వెళ్లియున్నారు గనుక ప్రతి ఆత్మను నమ్మక, ఆయా ఆత్మలు దేవుని సంబంధమైనవో కావో పరీక్షించుడి. యేసు క్రీస్తు శరీరధారియై వచ్చెనని, యే ఆత్మ ఒప్పుకొనునో అది దేవుని సంబంధమైనది.

1 యోహా 4 : 1, 2.

వారా సముద్రమునకు అద్దరి నున్న గెరాసేనుల దేశమునకు వచ్చిరి. ఆయన దోనె దిగగానే, అపవిత్రాత్మపట్టిన వాడొకడు సమాధులలో నుండి వచ్చి ఆయనకెదురు పడెను. ... యేసు వాటికి సెలవియ్యగా ఆ అపవిత్రాత్మలు వానిని విడిచి పందులలో ప్రవేశించెను. ప్రవేశింపగా ఇంచుమించు రెండు వేల సంఖ్యగల ఆ మందప్రపాతము నుండి సముద్రపు దారిని వడిగా పరుగెత్తికొని పోయి,సముద్రములో పడి ఊపిరి తిరుగక చచ్చెను.

మార్కు 5:1,2,13.

ఆయన అద్దరినున్న గదరేనీయుల దేశము చేరగా దయ్యములు పట్టిన ఇద్దరు మనుష్యులు సమాధులలో నుండి బయలు దేరి మిగుల ఉగ్రులై ఆయనకు ఎదురుగా వచ్చిరి....ఆయన వాటిని పొమ్మనగా అవి ఆ మనుష్యులను వదిలి పెట్టి ఆ పందులలోనికి పోయెను. ఇదిగో ఆ మందంతయు ప్రపాతము నుండి సముద్రములోనికి వడిగా పరుగెత్తికొనిపోయి నీళ్లలో పడి చచ్చెను.

మత్త 8 : 28, 32.

వారు గెరసీనీయుల దేశమునకు వచ్చిరి. ఆయన ఒడ్డున దిగినప్పుడు ఆ ఊరి వాడొకడు ఆయనకు ఎదురుగా వచ్చెను. వాడు బహు కాలము నుండి దయ్యములు పట్టిన వాడై యుండెను.

లూకా 8 : 26, 27

ఆయన తన శిష్యులతోను బహుజన సమూహముతోను యెరికోనుండి బయలు

వారు యెరికో నుండి వెళ్లుచుండగా బహుజన సమూహము ఆయన వెంట

దేరి వచ్చుచుండగా తీమయి కుమారుడగు బర్తిమయియను గ్రుడ్డి భిక్షకుడు త్రోవ ప్రక్కను కూర్చుండెను. ఈయన నజరేయుడైన యేసు అనివాడు విని-దావీదు కుమారుడా యేసూ, నన్ను కరుణింపుమని కేకలు వేయ మొదలు పెట్టెను.

మార్కు 10:46,47.

వెళ్లెను. ఇదిగో త్రోవ ప్రక్కను కూర్చున్న యిద్దరు గ్రుడ్డివారు యేసు ఆ మార్గమున వెళ్లుచున్నాడని విని-ప్రభువా, దావీదు కుమారుడా, మమ్ము కరుణింపుమని కేకలు వేసిరి.

మత్త 20 : 29, 30.

ఒకడు నీటి మూలముగాను ఆత్మ మూలముగాను జన్మించితేనే గాని దేవుని రాజ్యములో ప్రవేశింపలేడు.

యోహా 3 : 5.

ప్రేమించు ప్రతివాడును దేవునిమూలముగా పుట్టినవాడై దేవుని ఎరుగును.

యోహా 4 . 7.

పరలోకమునుండి దిగి వచ్చినవాడే, అనగా పరలోకములో ఉండు మనుష్య కుమారుడే తప్ప పరలోకమునకు ఎక్కిపోయిన వాడెవడును లేడు.

యోహా 3 : 13.

ఏలియా సుడిగాలి చేత ఆకాశమునకు ఆరోహణమాయెను.

2 రాజు 2 : 11.

విశ్వాసమును బట్టి హనోకు మరణము చూడకుండునట్లు కొనిపోబడెను.

హెబ్రీ 11 ; 5; ఆది 5 : 24.

అయితే మీకు జీవము కలుగునట్లు మీరు నా యొద్దకు రానొల్లరు.

యోహా 5 : 40.

నన్ను పంపిన తండ్రి వానిని ఆకర్షించితేనే గాని యెవడును నా యొద్దకు రాలేడు. అంత్య దినమున నేను వానిని లేపుదును. యోహా 6 ::

తండ్రి యెవరికిని తీర్పు తీర్చడుగాని తీర్పు తీర్చుటకు సర్వాధికారము కుమారునికి అప్పగించి యున్నాడు.

యోహా 5 : 22.

నేనెవరికిని తీర్పు తీర్చను.

యోహా 8 : 15.

ఎవడైనను నా మాటలు వినియు వాటిని గైకొనకుండిన యెడల నేనతనికి

తీర్పు తీర్చను. నేను లోకమునకు తీర్పు తీర్చుటకు రాలేదుగాని లోకమును రక్షించుటకే వచ్చితిని.

యోహా 12 : 47.

నేను భూమి మీదికి సమాధానమును పంప వచ్చితినని తలంచకుడి, ఖడ్గమునే గాని సమాధానమును పంపుటకు నేను రాలేదు. మత్త 10 : 34.

యేసుక్రీస్తు ద్వారా దేవుడు సమాధానకరమైన సువార్తను ప్రకటించి ఇశ్రాయేలీయులకు వర్తమానము పంపెను.

అపొ 10 : 36.

నేను భూమి మీద అగ్ని వేయ వచ్చితిని. అది ఇదివరకే రగులుకొనియుండవలెనని యెంతో కోరుచున్నాను....నేను భూమి మీద సమాధానము కలుగజేయ వచ్చితినని మీరు తలంచుచున్నారా? కాదు, భేదమునే కలుగజేయ వచ్చితినని మీతో చెప్పుచున్నాను. ఇప్పటి నుండి ఒక ఇంటిలో అయిదుగురు వేరుపడి ఇద్దరికి విరోధముగా ముగ్గురును, ముగ్గురికి విరోధముగా ఇద్దరును ఉందురు. తండ్రి కుమారునికి, కుమారుడు తండ్రికిని, తల్లి కుమార్తెకును, కుమార్తె తల్లికిని, అత్త కోడలికిని, కోడలు అత్తకును విరోధులుగా ఉందురని చెప్పెను.

లూకా 12 : 49_53.

దేవునికి ఇష్టులైన మనుష్యులకు భూమిమీద సమాధానము కలుగును.

లూకా 2 . 14.

ఎవడైనను నా యొద్దకు వచ్చి తన తండ్రిని, తల్లిని, భార్యను, పిల్లలను, అన్నదమ్ములను అక్కచెల్లెండ్రను తన

తన సహోదరుని ద్వేషించువాడు నరహంతకుడు. ఏ నరహంతకుని యందును

ప్రాణమును సహా ద్వేషింపకుంటే వాడు నా శిష్యుడు కానేరడు.

లూకా 14 : 26.

అడుగుడి మీ కియ్యబడును, వెదకుడి మీకు దొరుకును, తట్టుడి మీకు తీయబడును. అడుగు ప్రతి వాడునుపొందును, వెదకు వానికి దొరుకును, తట్టువానికి

మత 7:7,8.

ఆయన ఆత్మయందు పెద్ద నిట్టూర్పు విడిచి — ఈ తరమువారు ఎందుకు సూచక క్రియ నడుగుచున్నారు ? ఈ తరమునకు ఏ సూచక క్రియయునను గ్రహింపబడదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని చెప్పి వారిని విడిచి పోయెను. మార్కు 8:12,13.

అప్పుడు శాస్త్రిలలోను పరిసయ్యుల లోను కొందరు — బోధకుడా, నీ వలన ఒక సూచకక్రియ చూడగోరు చున్నామని ఆయనతో చెప్పగా ఆయన ఇట్లనెను — వ్యభిచారులైన చెడ్డతరమువారు సూచక క్రియను అడుగుచున్నారు. ప్రవక్తయైన యోనానుగూర్చినసూచకక్రియయేగాని మరి ఏ సూచక క్రియయైనను వారికి అనుగ్రహింపబడదు. మత 12:38,39.

యేసు-నేనే మార్గమును, సత్యమును

నిత్య జీవముండదని మీరెరుగుదురు.

1 యోహా 3 : 15.

ఇరుకు ద్వారమున ప్రవేశింప పోరాడుడి; అనేకులు ప్రవేశింప జూతురు గాని వారి వలన కాదని మీతో చెప్పుచున్నాను. లూకా 13 : 24.

దేవుడు నజరేయుడగు యేసు చేత అద్భుతములను మహత్కార్యములను సూచక క్రియలను మీ మధ్యను చేయించి, ఆయనను తన వలన మెప్పు పొందిన వానిగా మీకు కనబరచెను.

అపొ 2 : 22.

మరియు అనేకమైన ఇతర సూచక క్రియలను యేసు తన శిష్యుల యెదుట చేసెను. యోహా 20 : 30.

నీవు దేవుని యొద్ద నుండి వచ్చిన బోధకుడవని మేమెరుగుదుము. దేవుడతనికి తోడైయుంటేనేగాని నీవు చేయుచున్న సూచక క్రియలను ఎవడును చేయలేడు. యోహా 3 : 2,

ప్రతి జనములోను ఆయనకు భయ

జీవమును; నా ద్వారానే తప్ప ఎవడును తండ్రియొద్దకు రాడు.

యోహా 14 : 6.

ఈ నామముననే మనము రక్షణ పొందవలెను గాని, ఆకాశము క్రింద మనుష్యులలో ఇయ్యబడిన మరి ఏనామమున రక్షణ పొందలేము.

అపొ 4 : 12.

పడి నీతిగా నడుచుకొను వానిని ఆయన అంగీకరించును. అపొ 10 : 35.

నీవు నాకు అనుగ్రహించిన వారిలో ఒకనినైనను నేను పోగొట్టుకొనలేదు.

యోహా 18 : 9.

నా తండ్రి నాకు రాజ్యమును నియమించినట్టుగా నా రాజ్యములో నా బల్లయొద్ద అన్నపానములు పుచ్చుకొని సింహాసనముల మీద కూర్చుండి ఇశ్రాయేలు పండ్రెండు గోత్రముల వారికి మీరుతీర్పు తీర్చుటకై, నేనును మీకు రాజ్యమును నియమించుచున్నాను,

లూకా 22:29,30.

నీవు నాకు అనుగ్రహించిన వారిని నీ నామమందు కాపాడితివి. నేను వారిని భద్ర పరచితిని. నాశన పుత్రుడు తప్ప వారిలో మరి ఎవడును నశింపలేదు.

యోహా 17 : 12.

ఒక ముక్క ముంచి సీమోనుకుమారుడగు ఇస్కరియోతు యూదా కిచ్చెను. వాడు ఆ ముక్క పుచ్చుకొనగానే సాతాను వానిలో ప్రవేశించెను.

యోహా 13 : 26, 27.

ప్రభువైనదేవుడు ఆయనతండ్రియైన దావీదు సింహాసనమును ఆయన కిచ్చును. ఆయన యాకోబు వంశస్థులను యుగయుగములు ఏలును.

లూకా 1:32 33.

యేసు—నా రాజ్యము ఈ లోక సంబంధమైనది కాదనెను.

యోహా 18 : 36.

ఆయన తన స్వకీయుల వద్దకు వచ్చెను. ఆయన స్వకీయులు ఆయనను అంగీకరింపలేదు.

యోహా 1 : 11.

నేను వాటికి నిత్య జీవము నిచ్చు చున్నాను గనుక అవి ఎన్నిటికిని నశింపవు, ఎవడును వాటిని నా చేతిలోనుండి అపహరింపడు. యోహా 10:28

అయితే కడవరి దినములలో కొందరు విశ్వాస భ్రష్టు లగుదురని ఆత్మ తేటగా చెప్పుచున్నాడు. 1 తిమో 4 : 1.

అందుకాయన వారితో ఇట్లనెను - తానును తనతో కూడ నున్న వారును ఆకలిగొని నందున దావీదునకు అవసరము వచ్చినప్పుడు అతడు చేసినది మీరెన్నడును చదువ లేదా? అబ్యాతారు ప్రధాన యాజకుడై యుండగా దేవ మందిరములోనికి వెళ్ళి, యాజకులే గాని ఇతరులు తినకూడని సముఖపు రొట్టెలు తాను తిని, తనతో కూడ ఉన్నవారి కిచ్చెను గదా.

మార్కు 2 : 25, 26.

దావీదు నోబులో యాజకుడైన అహీమెలెకు నొద్దకు వచ్చెను... అంతట యెహోవా సన్నిధి నుండి తీసివేయబడిన సన్నిధి రొట్టెలు తప్ప అక్కడ వేరు రొట్టెలు లేకపోగా, ప్రతిష్ఠితమైన రొట్టెలను యాజకుడు అతనికిచ్చెను.... అయితే అహీటూబు కుమారుడైన అహీమెలెకు కుమారులలో అబ్యాతారు అను నొకడు తప్పించుకొని పారిపోయి దావీదు నొద్దకు వచ్చి సౌలు యెహోవా యాజకులను చంపించిన సంగతి దావీదున తెలియ జేసెను.

1 సమూ 2.:1,6: .2: 0

ప్రయాణము కొరకు చేతికఱ్ఱ తప్ప రొట్టెనైనను జాలెనైనను సంచిలో సొమ్మునైనను తీసికొనక చెప్పులు తొడుగుకొనుడనియు, రెండంగీలు వేసుకొన వదనియు వారి కాజ్ఞాపించెను.

మార్కు 6 : 8, 9.

మీ సంచులలో బంగారమైనను వెండినైనను రాగినైనను ప్రయాణము కొరకు జాలెనైనను రెండు అంగీలనైనను చెప్పులనైనను చేతి కఱ్ఱనైనను సిద్ధపరచు కొనకుడి.

మత 10 : 9

రేపటిని గూర్చి చింతింపకుడి, రేపటి దినము దాని సంగతులను గూర్చి చింతించును. మత్త 6:34.

ఎవడైనను స్వకీయులను విశేషముగా తన ఇంటివారిని, సంరక్షింపక పోయిన యెడల వాడు విశ్వాస త్యాగము చేసిన

వాడై అవిశ్వాసి కన్న చెడ్డవాడై యుండును. 1 తిమో 5 : 8.

యేసు — నన్ను గూర్చినేను సాక్ష్యము చెప్పుకొనినను నా సాక్ష్యము సత్యమే.... ....నన్ను గూర్చి నేను సాక్ష్యము చెప్పు కొను వాడను. యోహా 8:14,18

నన్ను గూర్చి నేను సాక్ష్యము చెప్పు కొనిన యెడల నా సాక్ష్యము సత్యము కాదు. యోహా 5 : 31

నన్నుగూర్చి సాక్ష్యమిచ్చు వేరొకడు కలడు. ఆయన నన్ను గూర్చి యిచ్చు సాక్ష్యము సత్యమని యెరుగుదును. మీరు యోహాను నొద్దకు (కొందరిని) పంపితిరి అతడు సత్యమునకు సాక్ష్య మిచ్చెను. నేను మనుష్యుల వలన సాక్ష్యమంగీకరిం పను. యోహా 5 : 32 — 34.

మీరు మొదట నుండి నాయొద్ద ఉన్న వారు గనుక మీరును సాక్ష్యమిత్తురు. యోహా 15 : 27.

ధర్మశాస్త్రమునైనను ప్రవక్తల వచనములనైనను కొట్టివేయవచ్చితిననితలంచవద్దు. నెరవేర్చుటకేగాని కొట్టివేయుటకు నేనురాలేదు. ఆకాశమును భూమియు గతించి పోయిననే గాని ధర్మశాస్త్ర మంతయు నెరవేరువరకు దాని నుండి యొక పొల్లయినను ఒక సున్నయైనను తప్పిపోదని నిశ్చయముగా మీతో చెప్పు చున్నాను. కాబట్టి ఈ మిగుల అల్పమైన యొక దానినైనను మీరి, మనుష్యులకు ఆలాగున చేయ బోధించు వాడెవడోవాడు పరలోక రాజ్యములో అల్పు డనబడును. అయితే వాటినిగైకొని బోధించు వాడె

కావున నా సహోదరులారా, క్రీస్తు అను వేరొకని చేరుటకై మీరును ఆయన శరీరము ద్వారా ధర్మ శాస్త్రము విషయమై మృతులైతిరి. రోమీ 7 : 4.

ఆయన విధిరూపకమైన ధర్మ శాస్త్ర మును తన శరీరమందు కొట్టివేసెను. ఎఫె 2 : 14, 15.

వచో పరలోక రాజ్యములో గొప్పవాడన బడును. మత 5:17-19.

తండ్రి కుమారుని ప్రేమించుచున్నాడు గనుక ఆయన చేతికి సమస్తము అప్ప గించి యున్నాడు. యోహా 3:3

నా కుడివైపునైనను నా యెడమ వైపునైనను కూర్చుండ నిచ్చుట నా వశమున లేదు. నా తండ్రి చేత ఎవరికి సిద్ధ పరచబడెనో వారికే అది దొరుకును. మత 20 : 23.

మనుష్య కుమారుడు తన మహిమ గల సింహాసనము మీదఆసీనుడై యుండు నపుడు నన్ను వెంబడించిన మీరును పండ్రెండు సింహాసనముల మీద ఆసీ నులై ఇశ్రాయేలు పండ్రెండు గోత్రముల వారికి తీర్పు తీర్చుదురు.

యేసు-నేను మిమ్మును పండ్రెండు గురిని ఏర్పరచు కొనలేదా? మీలో ఒకడు సాతాను యోహా 6 : 70.

అయితే ఎవని చేత మనుష్య కుమా రుడు అప్పగింపబడుచున్నాడో, ఆ మను ష్యునికి శ్రమ; ఆ మనుష్యుడు పుట్టి యుండని యెడల వానికి మేలనెను.

మార్కు 14 : 21.

పాపము చేయని వాడెవడును లేడు.

2 దిన 6:36

పాపము చేయక మేలుచేయుచుండు నీతిమంతుడు భూమి మీద ఒకడైనను లేడు. ప్రసం 7 : 20

ఆయన యందు నిలిచి యుండు వాడె వడును పాపము చేయడు. పాపము చేయువాడెవడును ఆయనను చూడను లేదు ఎరుగను లేదు....దేవుని మూల ముగా పుట్టిన ప్రతి వానిలో ఆయన బీజము నిలుచును గనుక వాడు పాపము చేయడు. వాడు దేవుని మూలముగా పుట్టిన వాడు గనుక పాపము చేయ జాలడు. 1 యోహా 3 : 6, 9.

ఆయన దేవుని స్వరూపము కలిగినవాడై యుండి దేవునితో సమానముగా ఉండుట విడిచి పెట్టకూడని భాగ్యమని యెంచుకొనలేదు. ఫిలి 2:6.

తండ్రికి కలిగిన వన్నియు నావి. యోహా 16 ; 15.

తండ్రి నా కంటె గొప్పవాడు. యోహా 14 : 28

ఆ దినమును గూర్చియు ఆ గడియను గూర్చియు తండ్రి తప్ప ఏ మనుష్యుడైనను, పరలోక మందలి దూతలైనను, కుమారుడైనను ఎరుగరు. మార్కు 13 : 32.

పస్కా పశువును వధింపవలసిన పులియని రొట్టెల దినమురాగా యేసు పేతురును యోహానును చూచి — మీరు వెళ్ళి మనము భుజించుటకై పస్కాను మనకొరకు సిద్ధపరచుడని వారిని పంపెను .... వారు వెళ్ళి ఆయనతమతో చెప్పినట్టు కనుగొని పస్కాను సిద్ధపరచిరి ఆ గడియ వచ్చినప్పుడు ఆయనయు ఆయనతో కూడ అపొస్తలులును పంక్తిని కూర్చుండిరి. అప్పుడాయన - నేను శ్రమపడక మునుపు మీతో కూడ ఈ పస్కాను భుజింప వలెనని మిక్కిలి ఆశ పడితిని. లూకా 22:7-9, 13-15.

తాను ఈ లోకము నుండి తండ్రి యొద్దకు వెళ్ల వలసిన గడియ వచ్చెనని యేసు పస్కా పండుగకు ముందే ఎరిగి యున్నాడు. వారు భోజనము చేయుచుండగా వానిని అప్పగింపవలెనని.... యోహా 3 : 1, 2.

ఆ దినము పస్కాను సిద్ధ పరచు దినము. అప్పుడు ఉదయము ఆరు ఘంటలు కావచ్చెను. అతడు-ఇదిగో మీ రాజు అని యూదులతో చెప్పగా, అందుకు వారు-ఇతనిని సంహరించుము, సంహరించుము, సిలువ వేయుము అని కేకలు వేసిరి. యోహా 19 : 14, 15

అప్పుడు శిష్యులందరు ఆయనను విడిచి పారిపోయిరి. మత్త 26:56.

నీవు నాకు అనుగ్రహించిన వారిలో ఒకనినైనను నేను పోగొట్టుకొనలేదని ఆయన చెప్పినమాట నెరవేరునట్లు ఈలాగు చెప్పెను. యోహా 18 : 9.

ఆయన-పేతురూ, నీవు నన్నెరుగనని ముమ్మారు చెప్పువరకు, నేడుకోడికూయ

పేతురు-ఆయన ఎవడో నేనెరుగను, నీవు చెప్పినది నాకు బోధ పడలేదని

దని నీతో చెప్పుచున్నాననెను.

లూకా 22:34.

యేసు - నా కొరకు నీ ప్రాణము పెట్టుదువా? ఆయనను ఎరుగనని నీవు ముమ్మారు చెప్పకముందు కోడికూయదని నీతో నిశ్చయముగా చెప్పుచున్నాననెను.

యోహా 13 : 38.

చెప్పి నడవలోనికి వెళ్లెను. అంతట కోడి కూసెను. ఆ పనికత్తె అతనిని చూచి-వీడు వారిలో ఒకడని దగ్గర నిలిచి యున్న వారితో మరల చెప్పసాగెను. అతడు మరల నేను కాననెను. కొంత సేపయిన తరువాత దగ్గర నిలిచియున్న వారు మరల పేతురును చూచి నీవు-గలిల యుడవు గదా అనిరి. అందు కతడు మీరు చెప్పుచున్న మనుష్యుని నేనెరుగ నని చెప్పి శపించుకొనుటకును, ఒట్టు బెట్టుకొనుటకును మొదలు పెట్టెను. వెంటనే రెండవ మారు కోడి కూసెను. గనుక-కోడి రెండు మారులు కూయక మునుపు నీవు నన్ను ఎరుగనని ముమ్మారు చెప్పెదవని యేసు తనతో చెప్పినమాట పేతురు జ్ఞాపకమునకు తెచ్చుకొనెను.

మార్కు 14 : 68-72.

ఆయనను సిలువ వేసినపుడు పగలు తొమ్మిది గంటలాయెను.

మార్కు 15 : 25.

అప్పుడు ఉదయము ఆరు ఘంటలు కావచ్చెను....వారు-ఇతనిని సంహరించుము సిలువ వేయుము అని కేకలు వేసిరి.

యోహా 19 : 14, 15.

యేసునకు ఉపచారము చేయుచు గలి లయనుండి ఆయనను వెంబడించినఅనేక మంది స్త్రీలు అక్కడ దూరమునుండి చూచుచుండిరి. వారిలో మగ్దలేనే మరి యయు యాకోబు యోసే అనువారి తల్లి యైన మరియయు. జెబెదయి కుమారుల

ఆయన తల్లియు, ఆయన తల్లి సహోదరియు, క్లోపా భార్యయైన మరియయు, మగ్దలేనే మరియయు యేసు సిలువ యొద్ద నిలుచుండిరి.

యోహా 19:25.

తలియు ఉండిరి.

మత్త .7 : 55, 16.

యేసు వానితో_నేడు నీవునాతోకూడ పరదైసులో వుందువని నిశ్చయముగా నీతో చెప్పుచున్నాననెను.

లూకా : 43.

యేసు ఆమెతో_నేను ఇంకను తండ్రి యొద్దకు ఎక్కిపోలేదు గనుక నన్ను ముట్టుకొనవద్దు. యోహా 20 17.

మూడు గంటలకు యేసు_నా దేవా, నా దేవా, నన్ను ఎందుకు చెయ్యి విడిచితి వని బిగ్గరగా కేకవేసెను.

మార్కు 15 : 34.

నేనును తండ్రియును ఏకమై యున్నాము. యోహా 10 : 30

దేవత్వము యొక్క సర్వపరిపూర్ణత శరీరముగా క్రీస్తు నందు నివసించు చున్నది. కొల 2 : 9.

ఆ దినము సిద్ధపరచు దినము. మరు సటి విశ్రాంతి దినము మహాదినము గనుక ఆ దేహములు విశ్రాంతి దినమున సిలువ మీద ఉండకుండునట్లు, వారి కాళ్ళువిరుగ గొట్టించి వారిని తీసివేయించు మని యూదులు పిలాతును అడిగిరి. కాబట్టి సైనికులు వచ్చి ఆయనతో కూడ సిలువ వేయబడిన మొదటి వాని కాళ్ళను రెండవవాని కాళ్ళను విరుగగొట్టిరి.

యోహా 19:31,32.

ఆ దినము సిద్ధ పరచు దినము, అనగా విశ్రాంతి దినమునకు పూర్వ దినము గనుక సాయంకాలమైనప్పుడు అరిమతయియ యోసేపు తెగించి, పిలాతు నొద్దకు వెళ్లి యేసు దేహము (తన కిమ్మని) యడిగెను. అతను ఘనత వహించిన యొక సభ్యుడై, దేవుని రాజ్యము కొరకు ఎదురు చూచువాడు. పిలాతు_ఆయన ఇంతలోనే చనిపోయెనా అని ఆశ్చర్యపడెను.

మార్కు 15 : 42-44.

యోనా మూడు రాత్రింబగళ్ళు తిమిం గలము కడుపులో ఏలాగుండెనో అలాగు

విశ్రాంతి దినము గడచి పోయిన తరువాత ఆదివారమున, తెల్లవారు

మనుష్య కుమారుడు మూడు రాత్రిం బగళ్ళు భూగర్భములో ఉండును

మత్త 12 : 40.

క్రీస్తు .... మృతుల పునరుత్థానము పొందువారిలో మొదటివాడు.

అపో 26 : 22, 23.

యేసుక్రీస్తు మృతులలో నుండి ఆది సంభూతుడుగా లేచినవాడు.

ప్రక 1 : 5.

ఆదివారము ( సిలువ వేయబడిన తరువాత )....యేసు....వారి మీద ఊది. పరిశుద్ధాత్మను పొందుడి అని చెప్పెను.

యోహా 20 : 19, 22.

షండగా మగ్దలేనే మరియయు వేరొక మరియయు సమాధిని చూడవచ్చిరి. ఆయన అక్కడ లేడు. తానుచెప్పినట్టే ఆయనలేచియున్నాడు

మత్త 28 : 1, 6.

ఆదివారమున ఇంకను చీకటిగా ఉన్నపుడు మగ్దలేనే మరియు పెందలకడ సమాధి మీద ఉండిన రాయి తీయబడి యుండుటచూచెను.

యోహా 20 : 1.

(పై వాక్యాలు ఒక రాత్రిని, రాత్రిలో కొంత భాగాన్ని, ఒక పగటిని, పగటిలో కొంత భాగాన్నిమాత్రమే చూపుతున్నాయి)

ఆయన ఆలాగు చెప్పి – లాజరూ, బయటికి రమ్మని బిగ్గరగా చెప్పగా చనిపోయినవాడు, కాళ్లు చేతులు ప్రేత వస్త్రములతోకట్టబడిన వాడై వెలుపలికివచ్చెను

యోహా 11:43,44.

(2 రాజు 4 : 32, 35; లూకా 7 : 12 – 15 కూడ చూడండి)

ఆయన శ్రమ పడిన తరువాత నలువది దినముల వరకు వారికగపడుచు అనేక ప్రమాణములను చూపి వారికితన్ను తాను సజీవునిగా కనపరచుకొనెను .... (యేసు ఇలా చెప్పాడు) కొద్ది దినముల లోగా మీరు పరిశుద్ధాత్మలో బాప్తిస్మము

పొందెదరు. అపొ 1:3,5.

(అపొ 2:1-4 కూడ చూడండి)

వారు సమాజమందిరముల పెద్దల యొద్దకును అధిపతుల యొద్దకును అధికారుల యొద్దకును మిమ్మును తీసికొని పోవునప్పుడు మీరు - ఏలాగు ఏమి ఉత్తర మిచ్చెదమా, యేమి మాటలాడుదుమా అని చింతింపకుడి. మీరేమి చెప్పవలసినదియు పరిశుద్ధాత్మ ఆ గడియలోనే మీకు నేర్పుననెను. లూకా 12 : 11, 12.

అయితే నేను మీతో సత్యము చెప్పుచున్నాను, నేను వెళ్ళిపోవుట వలనమీకు ప్రయోజనకరము. నేను వెళ్ళని యెడల ఆదరణ కర్త మీ యొద్దకు రాడు. నేను వెళ్ళిన యెడల ఆయనను మీ యొద్దకు పంపుదును. యోహా 16:7

అతడు (యోహాను) తన తల్లి గర్భమున పుట్టినది మొదలుకొని పరిశుద్ధాత్మతో నిండుకొనినవాడు లూకా 1 : 15.

ఎలీసబెతు పరిశుద్ధాత్మతో నిండుకొనెను. లూకా 1 : 41.

మరియు అతని తండ్రి జకర్యా పరిశుద్ధాత్మ పూర్ణుడై ప్రవచించెను.

లూకా 1:67.

(లూకా 2:25-27 కూడ చూడండి)

తన యందు విశ్వాస ముంచువారు పొందబోవు ఆత్మను గూర్చి ఆయన ఈ మాట చెప్పెను. యేసు ఇంకను మహిమ పరచబడలేదు గనుక ఆత్మ ఇంకను అనుగ్రహింపబడి యుండలేదు.

యోహా 7 : 39.

యూదా ద్రోహము వలన సంపాదించిన రూకలనిచ్చి యొక పొలము కొనెను. అతడు తల క్రిందుగా పడి నడిమికి బద్దలైనందున అతని పేగులన్నియు బయటికి వచ్చెను.

అపొ 1 : 18.

అతడు (యూదా) ఆ వెండి నాణెములు దేవాలయములో పారవేసి, పోయి ఉరి పెట్టుకొనెను. ప్రధాన యాజకులు .... వాటి నిచ్చి, కుమ్మరి వాని పొలము కొనిరి. మత్త 27:5-7.

మీరు పై నుండి శక్తి పొందువరకు పట్టణములో (యెరూషలేములో) నిలిచి యుండుడు. లూకా 24.49

యేసు వారికి యీలాగు ఆజ్ఞాపించెను. మీరు యెరూషలేము నుండి వెళ్లక, నా వలన వినిన తండ్రియొక్క వాగ్దానము కొరకు కనిపెట్టుడి. అపొ 1:4.

(యేసు) బేతనియ నుండి పరలోకమునకు ఆరోహణుడాయెను.

లూకా 24:50,51.

ఒలీవలకొండ వద్ద ఆరోహణుడాయెను. అపొ 1:9, 12.

యెరూషలేములోని ఒక ఇంటి వద్ద నుండి ఆరోహణుడాయెను.

మార్కు 16:14,19.

గలిలయ ప్రాంతము నుండి ఆరోహణుడాయెను. మత్త 28:16-20

ఆయన మీకంటె ముందుగా గలిలయలోనికి వెళ్ళుచున్నాడు. ఆయన మీతో చెప్పినట్లు అక్కడ మీరు ఆయనను చూతురు. మార్కు 16:7.

పదనొకండు మంది శిష్యులు యేసు తమకు నిర్ణయించిన గలిలయలోని కొండకు వెళ్ళిరి. మత్త 28 : 16

వారు బయటకు వచ్చి విస్మయము నొంది వణకుచు సమాధి యొద్ద నుండి పారిపోయిరి. వారు భయపడి నందున ఎవనితో ఏమియు చెప్పలేదు.

మార్కు 16:8.

అప్పుడు మొదట సమాధి యొద్దకు వచ్చిన ఆ శిష్యుడు లోపలికి పోయిచూచి నమ్మెను. ఆయన మృతులలో నుండి లేచుట అగత్యమను లేఖనము వారింకను

అప్పుడు వారాయన మాటలు జ్ఞాపకము చేసికొని సమాధియొద్దనుండి తిరిగి వెళ్ళి ఈ సంగతులన్నియు పదనొకండుగురు శిష్యులకును తక్కినవారి కందరికిని తెలియజేసిరి. లూకా 24:8,9.

ఆదివారము తెల్లవారినప్పుడు యేసు లేచి, తాను ఏడు దయ్యములను వెళ్ళ గొట్టిన మగ్దలేనే మరియకు మొదట కనబడెను. ఆయనతో ఉండినవారు దుఃఖపడి

గ్రహింపరైరి. యోహా 20:8, 9.

యేడ్చుచుండగా ఆమె వెళ్ళి ఆసంగతి వారికి తెలియజేసెను.

మార్కు 16 : 9, 10.

ఆయన ఇంక గలిలయలో ఉండినప్పుడు - మనుష్యకుమారుడు పాపిష్ఠులైన మనుష్యుల చేతికి అప్పగింపబడి, సిలువ వేయబడి మూడవ దినమందు లేవ వలసియున్నదని ఆయనమీతో చెప్పిన మాట జ్ఞాపకము చేసికొనుడని వారితో అనిరి. అప్పుడు వారు ఆయన మాటలు జ్ఞాపకము చేసికొనిరి.

లూకా 24 : 6 - 8.

(మత్త 20 : 19; 27:63,64; మార్కు 8:31; 10:34; లూకా 18:32-34 కూడ చూడండి)

యేసు ఆమెతో-నేను ఇంకను తండ్రి యొద్దకు ఎక్కిపోలేదు గనుక నన్ను ముట్టుకొనవద్దు. యోహా 20:17.

విశ్రాంతి దినము గడిచి పోయినతరువాత ఆదివారమున, తెల్లవారు చుండగా మగ్దలేనే మరియయు వేరొక మరియయు సమాధిని చూడవచ్చిరి .... యేసు వారిని యెదుర్కొని-మీకు శుభమని చెప్పెను. వారు ఆయనయొద్దకు వచ్చి, ఆయన పాదములు పట్టుకొనిఆయనకు మ్రొక్కిరి.

మత్త 28 : 1, 9.

అటు తరువాత యేసు తిబెరియ సముద్ర తీరమున శిష్యులకు మరల తన్నుతాను ప్రత్యక్ష పరచుకొనెను.... యేసు మృతులలో నుండి లేచిన తరు

యేసు ఇప్పటికే ఈ క్రింది వ్యక్తులకు తననుతాను ప్రత్యక్షపరచుకొన్నాడు. 1) మగ్దలేనే మరియ, 2) ఇద్దరు మరియలు, 3) ఎమ్మాయుగ్రామమునకువెళ్ళ

వాత శిష్యులకు ప్రత్యక్షమైనది యిది మూడవసారి. యోహా 21:1,14.

చున్న యిద్దరు శిష్యులు (లూకా 24:13 15 , 4. పేతురు (లూకా 24 : 34 , 5. పదునొకండుగురు శిష్యులు (లూకా 24 : 33, 36`, 6. పదిమంది శిష్యులు (యోహా 20:24), 7. పదనొకండుగురు శిష్యులు (యోహా 20:26), 8. "పండ్రెం డుగురు శిష్యులు" (1కొరిం 15 : 5). 9. ఐదువందల మంది సహోదరులు (1 కొరిం 15:6), 10. యాకోబు (1 కొరిం 15:7 , 11. అపొస్తలు లందరు (1 కొరిం 15:7).

యేసు-పరలోక మందును భూమి మీదను నాకు సర్వాధికారము ఇయ్యబడి ంది. మత్త 28:18.

దుర్నీతిని పుట్టించు సమస్త మోసముతోను, నశించు చున్నవారిలో సాతానుకన పరచు బలమును అనుసరించుయుండును. 2 థెస్స 2:9,10.

ఆ కాలమందు ఇంచుమించు నూట ఇరువది మంది సహోదరులు నిలిచి యుండగా పేతురు వారి మధ్య నిలిచెను. (క్రీస్తు ఆరోహణయ్యాక) అపొ 1:15.

ఐదువందలకు ఎక్కువైన సహోదరులకు ఒక్క సమయమందే కనబడెను. 1 కొరిం 15:6.

ఆతనితో ప్రయాణము చేసిన మనుష్యులు ఆ స్వరము వినిరిగాని యెవనిని చూడక మౌనులై నిలువబడిరి. అపొ 9 : 7.

నాతో కూడ నున్నవారు ఆవెలుగును చూచిరిగాని నాతో మాటలాడిన వాని స్వరము వారు వినలేదు. అపొ 22 : 9.

(పవిత్ర గ్రంథంలో పై వాక్యాన్ని "నాతో ఉన్నవారు ఆ వెలుగును చూశారు గాని నాతో మాట్లాడిన వ్యక్తి స్వరంవారు అర్థం

చేసుకోలేదు' అని అనువదించారు. అను)

షేమందరము నేల పడినప్పుడు ఒక స్వరము నాతో పలుకుట వింటిని.

అపో 26 : 14.

దేవుడు పక్షపాతి కాడు.

అపో 10 : 34.

దేవునికి పక్షపాతము లేదు.

రోమీ 2 : 11.

పిల్లలింక పుట్టిమేలైనను కీడైనను చేయకముందే పెద్దవాడు చిన్నవానికిదాసు డగును అని ఆమెతో చెప్పబడెను. ఇందును గూర్చి నేను యాకోబును ప్రేమించితిని, ఏశావును ద్వేషించితిని అని వ్రాయబడి యున్నది.

రోమీ 9:11-13.

(మలా 1 : 2,3; ఆది 4,4,5 కూడ చూడండి)

వారు అతని చంపవలెనని రాత్రిం బగళ్లు ద్వారముల యొద్ద కాచుకొను చుండిరి గనుక అతని శిష్యులు రాత్రివేళ అతనిని తీసికొనిపోయి గంపలో ఉంచి, గోడ గుండ అతనిని క్రిందికి దింపిరి. అతడు యెరూషలేములోనికి వచ్చి శిష్యులతో కలిసికొనుటకు యత్నము చేసెను గాని, అతడు శిష్యుడని నమ్మక అందరును ఆతనికి భయపడిరి. అయితే బర్నబా అతనిని దగ్గర తీసి అపొస్తలులయొద్దకు తోడుకొని వచ్చి-అతడు త్రోవలో ప్రభువును చూచెననియు, ప్రభువు ఆతనితో మాటలాడెననియు, అతడు దమస్కులో యేసు నామమును బట్టి ధైర్యముగా

తన కృపచేత నన్ను పిలిచిన దేవుడు నేను అన్యజనులలో తన కుమారుని ప్రకటింపవలెనని ఆయనను నా యందు బయలు పరపననుగ్రహించి నప్పుడు మనుష్య మాత్రులతో నేను సంప్రతింప లేదు. నా కంటె ముందుగా అపొస్తలులైనవారియొద్దకు యెరూషలేమునకైనను వెళ్లను లేదు గాని వెంటనే అరేబియా దేశములోనికి వెళ్లితిని పిమ్మట దమస్కు పట్టణమునకు తిరిగి వచ్చితిని. అటుపైని మూడు సంవత్సరములైనతరువాత కేఫాను పరిచయము చేసికొనవలెనని యెరూషలేమునకు వచ్చి అతనితో కూడ పదునయిదు దినములుంటిని అత

బోధించెననియు, వారికి వివరముగా తెలియపరచెను. అతడు యెరూషలేములో వారితోకూడ వచ్చుచు పోవుచు యుండెను.
అపొ 9:24-28.

నిని తప్ప అపొస్తలులలో మరియెవనిని నేను చూడలేదు గాని, ప్రభువుయొక్క సహోదరుడైన యాకోబును మాత్రము చూచితిని. నేను మీకు వ్రాయుచున్న ఈ సంగతుల విషయమై, యిదిగో దేవుని యెదుట నేను అబద్ధమాడుట లేదు.
గల 1:15-20.

పనిచేయక భక్తిహీనుని నీతిమంతునిగా తీర్చు వానియందు విశ్వాసముంచు వానికి వాని విశ్వాసము నీతిగా ఎంచబడుచున్నది. ఆ ప్రకారమే క్రియలు లేకుండ దేవుడెవనిని నీతిమంతుడుగా ఎంచునో ఆ మనుష్యుడు ధన్యుడని దావీదు కూడ చెప్పుచున్నాడు. రోమీ 4 : 5, 6.

మీరు విశ్వాసము ద్వారా కృపచేతనే రక్షింపబడి యున్నారు. ఇది మీ వలన కలిగినది కాదు, దేవుని వరమే, అది క్రియల వలన కలిగినది కాదు గనుక ఎవడును అతిశయ పడ వీలులేదు.
ఎఫె 2:8, 9.

నా సహోదరులారా, క్రియలు లేనప్పుడు ఎవడైనను తనకు విశ్వాసము కలదని చెప్పిన యెడల ఏమిప్రయోజనము? అట్టి విశ్వాసమతని రక్షింపగలదా? .... అలాగే విశ్వాసము క్రియ లేనిదైతే అది ఒంటిగా ఉండి మృతమైన దగును .... మనుష్యుడు విశ్వాస మూలమున మాత్రము కాక క్రియల మూలమునను నీతిమంతుడని ఎంచబడునని, మీరు దీనివలన గ్రహించితిరి .... ప్రాణములేని శరీరమే లాగు మృతమో అలాగే క్రియలు లేని విశ్వాసమును మృతము.
యాకో 2:14.17,2',26.

ధర్మశాస్త్రము లేక పాపము చేసినవారందరు ధర్మ శాస్త్రము లేకయే నశించుదురు. రోమీ 2 : 12

ధర్మశాస్త్రము లేనియెడల అతిక్రమమును లేకపోవును. రోమీ 4:15.

పిలువబడినవారు అనేకులు, ఏర్పరచబడినవారు కొందరే. మత్త 22:14

నా తోడు, ప్రతి మోకాలును నా యెదుట వంగును, ప్రతి నాలుకయు దేవుని స్తుతించును అనివ్రాయబడి యున్నది.
రోమీ 14:11,12.

నిబ్బరమైన బుద్ధి గలవారై మెలకువగా ఉండుడి. మీ విరోధియైన అపవాది గర్జించు సింహము వలె ఎవరిని మ్రింగుదునా అని వెదకుచు తిరుగుచున్నాడు. 1 పేతు 5 : 8.

దేవుని మూలముగా పుట్టిన ప్రతివానిలో ఆయన బీజము నిలుచును గనుక వాడు పాపము చేయడు. వాడు దేవుని మూలముగా పుట్టినవాడు గనుక పాపము చేయజాలడు. 1 యోహా 3 : 9.

నీతి మంతుని విజ్ఞాపన మనః పూర్వకమైనదై బహుబలము గలదై యుండును. యాకో 5 : 16.

పరిశుద్ధాత్మ విషయము దూషణచేయువాడెప్పుడును క్షమాపణ పొందడు. మార్కు 3 : 29.

నా సహోదరులారా, మీరు నానా విధములైన శోధనలలో పడునప్పుడు, అది మహానందమని యెంచుకొనుడి. యాకో 1:2, 3.

మృతులు లేపబడని యెడల క్రీస్తు కూడ లేపబడలేదు....బూర మ్రోగును. అప్పుడు మృతులు అక్షయులుగా లేపబడుదురు. 1 కొరిం 5 : 16, 52.

మరియు తమ ప్రధానత్వమునునిలుపుకొనక తమ నివాస స్థలమును విడిచిన దేవదూతలను, మహాదినమున జరుగు తీర్పువరకు కటిక చీకటిలో నిత్యపాశములతో ఆయన బంధించి భద్రముచేసెను యూదా 6.

మనము పాపము లేని వారమనిచెప్పుకొనిన యెడల మనలను మనమే మోసపుచ్చుకొందుము. మరియు మనలో సత్యముండదు. 1 యోహా 1 : 8.

నీతిమంతుడు లేడు, ఒక్కడును లేడు రోమీ 3 : 10.

విశ్వసించు ప్రతివాడును ఈయనవలననే నీతిమంతుడుగా తీర్చబడును. అపొ 13 : 39.

మమ్మును శోధనలోనికి తేక దుష్టుని నుండి మమ్మును తప్పించుము మత 6 : 3

మేఘమువిడిపోయి అదృశ్యమగునట్లు పాతాళమునకు దిగిపోయినవాడు మరి యెప్పుడును రాడు. యోబు 7:9

దీనికి ఆశ్చర్యపడకుడి; ఒక కాలము వచ్చు చున్నది, ఆ కాలమున సమాధుల లోనున్న వారందరు ఆయన శబ్దము విని బయటకు వచ్చెదరు.

యోహా 5:28, 29.

మరియు గొప్పవారేమి కొద్దివారేమి మృతులైన వారందరు ఆ సింహాసనము యెదుట నిలువబడి యుండుట చూచి తిని....వారిలో ప్రతి వాడు తన క్రియల చొప్పున తీర్పు పొందెను.

ప్రక 20 : 12, 13.

చచ్చినవారు ఏమియు ఎరుగరు. వారి పేరు మరువబడి యున్నది. వారికిక ఏ లాభమును కలుగదు.

ప్రసం 9 : 5.

(ప్రసం 3:19-22 కూడ చూడండి)

తరము వెంబడి తరము గతించిపోవు చున్నది. భూమి యొకటే యెల్లప్పుడును నిలుచునది. ప్రసం 1 : 4.

భూమి యెన్నటికిని కదలకుండునట్లు ఆయన దానిని పునాదుల మీద స్థిర పరచెను. కీర 104 : 5.

ఆదినమున ఆకాశములు మహాధ్వనితో గతించిపోవును,పంచభూతములు మిక్కుటమైన వేండ్రముతోలయమై పోవును. భూమియు దాని మీదనున్న కృత్యములును కాలిపోవును. 2 పేతు 3 : 10.

ప్రభువా, నీవు ఆదియందు భూమికి పునాది వేసితివి. ఆకాశములు కూడా నీ చేతిపనులే. అవి నశించునుగాని నీవు నిలిచి యుందువు.

హెబ్రీ 1 : 10, 11.

ఎవడును ఎప్పుడైనను దేవుని చూడ లేదు. యోహా 1 : 18.

మనుష్యులలో ఎవడును ఆయనను చూడలేదు, ఎవడును చూడనేరడు.

1 తిమో 6 : 16

మోషే అహరోను నాదాబు అబీహు ఇశ్రాయేలీయుల పెద్దలలో డెబ్బది మందియు ఎక్కిపోయి ఇశ్రాయేలీయుల దేవుని చూచిరి. ఆయన పాదములక్రింద నిగనిగలాడు నీలమయమైన వస్తువు

దేవుడు ఆత్మ. యోహా 4 : 24.

మీరు కాలమందైనను ఆయన స్వరము వినలేదు. ఆయన స్వరూపము చూడలేదు. యోహా 5 : 37.

నీవు నా ముఖమును చూడజాలవు. ఏ నరుడును నన్ను చూచి బ్రదుకడనెను. నిర్గ 33 : 20.

వంటిదియు ఆకాశ మండలపు తేజము వంటిదియు ఉండెను.

నిర్గ 24 : 9, 10.

నా మహిమ నిన్ను దాటి వెళ్ళు చుండగా ఆ బండ సందులో నిన్నుఉంచి, నిన్నుదాటి వెళ్ళువరకు నా చేతితోనిన్ను కప్పెదను. నేను నాచెయ్యితీసిన తరువాత నా వెనుక పార్శ్వమును చూచెదవు కాని నా ముఖము నీకు కనబడదని మోషేతో చెప్పెను. నిర్గ 33:22,23.

యెహోవా బలిపీఠమునకు పైగా నిలిచి యుండుట నేను చూచితిని.

అమో 9 : 1.

యేసు - ఫిలిప్పూ నేనింత కాలము మీ యొద్ద ఉండినను నీవు నన్ను ఎరుగవా? నన్ను చూచినవాడు తండ్రిని చూచి యున్నాడు గనుక తండ్రిని మాకు కను పరచుమని యేల చెప్పుచున్నావు?

యోహా 14 : 9.

మనుష్యుడు తన స్నేహితునితోమాట లాడునట్లు యెహోవా మోషేతో ముఖా ముఖిగా మాటలాడు చుండెను.

నిర్గ 33 : 11.

యాకోబు - నేను ముఖాముఖిగా దేవుని చూచితిని అయినను నా ప్రాణము దక్కినదని ఆ స్థలమునకు పెనూయేలు అనుపేరు పెట్టెను. ఆది 32:30

దేవుడు అల్లరికి కర్తకాడు.

1 కొరిం 14 : 33.

నేను వెలుగును సృజించు వాడను. అంధకారమును కలుగజేయువాడను. సమాధాన కర్తను కీడును కలుగజేయువాడను నేనే. యెహోవా అను నేనే వీటినన్నిటిని కలుగజేయువాడను.

యెష 45 : 7.

(న్యాయా 9:23; 1 సమూ 16:14; 2 థెస్స 2 : 11 కూడ చూడండి)

నా యెదుట ప్రతి మోకాలు వంగుననియు ప్రతి నాలుకయు నాతోడని ప్రమాణము చేయుననియు నేను నా పేరట ప్రమాణము చేసి యున్నాను.

యెష 45 : 23.

ఎంత మాత్రము ఒట్టుపెట్టుకొనవద్దు.

మత్త 5 : 34.

దేవునికి సమస్తమును సాధ్యమే.

మార్కు 10 : 27.

ప్రభువగు దేవుడు సర్వాధికారి.

ప్రక 19:6, 7.

నేను సర్వశక్తిగల దేవుడను.

ఆది 17 : 1.

యెహోవా యూదా వంశస్థులకు తోడై యున్నందునవారు మన్యదేశమును స్వాధీనపరచుకొనిరి అయితే మైదా[illegible] మందు నివసించు వారికి ఇ[illegible]ప లున్నందున వారి[illegible] వెళ్లగొట్ట[illegible]

న్యాయా : 9.

తండ్రి కుమారుని ప్రేమించుచున్నాడు గనుక ఆయన చేతికి సమస్తము అప్పగించి యున్నాడు. యోహా 3:35.

మరియే అద్భుతమును ఆయన అక్కడ చేయజాల[illegible] పోయెను.

మార్కు 6 : 5.

ప్రభువు ఎవడును నశింప వలెనని యిచ్ఛయింపక యుండెను.

2 పేతు 3 : 9.

యెహోవా ప్రతి వస్తువును దాని పని నిమిత్తము కలుగజేసెను. —శ దినమునకు ఆయన భక్తిహీనులను కలుగ

జేసెను. సామె 16:4

ఆయన మనుష్యులందరు రక్షణ పొందవలెనని యిచ్ఛయించు చున్నాడు. 1 తిమో 2 : 4.

ఆయన ఎవని కఠిన పరచగోరునో వాని కఠినపరచును. రోమీ 9:13.

ఆయన కోపము నిముషమాత్ర ముండును. కీర 30 : 5.

అప్పుడు యెహోవా కోపము ఇశ్రాయేలీయుల మీదరగులుకొనగా యెహోవా దృష్టికి చెడు నడత నడిచిన ఆ తరము వారందరు నశించు వరకు అరణ్యములో నలుబది యేండ్లు ఆయన వారిని తిరుగులాడ చేసెను, సంఖ్యా 32;13.

అబద్ధమాడు పెదవులు యెహోవాకు హేయములు. సామె 12:22.

యెహోవా నిన్ను గూర్చి కీడు యోచించి నీ ప్రవక్తల నోటఅబద్ధమాడు ఆత్మను ఉంచియున్నాడు,

1 రాజు 22:2

దేవుడు అబద్ధ మాడుటకు ఆయన మానవుడు కాడు, పశ్చాత్తాప పడుటకు ఆయన నరపుత్రుడు కాడు.

సంఖ్యా 23 : 19.

ఇశ్రాయేలీయులకు ఆధారమైనవాడు నరుడు కాడు, ఆయన అబద్ధమాడడు, పశ్చాత్తాపపడడు.

1 సమూ 15 : 29.

యెహోవానైన నేను మార్పులేని వాడను. మలా 3 : 6.

తాను భూమి మీద నరులను చేసి నందుకు యెహోవా సంతాపము నొంది తన హృదయములో నొచ్చుకొనెను.

ఆది 6 : 6.

(ద్వితీ 32 : 36,37; కీర్త 135:14 కూడ చూడండి)

తాను సౌలును ఇశ్రాయేలీయుల మీద రాజుగా నిర్ణయించినందుకు యెహోవా పశ్చాత్తాపము పడెను.

1 సమూ 15:35

ఆయన యందు ఏ చంచలత్వమైనను, గమనాగమనము వలన కలుగు ఏ ఛాయయైనను లేదు.

యాకో 1 : 17.

అంతట యెహోవా తన ప్రజలకు చేసెదనని చెప్పిన కీడును గూర్చి సంతాప పడెను. నిర్గ 32 : 14.

వారు చేయుచున్న క్రియలను దేవుడు చూచి పశ్చాత్తప్తుడై వారికి చేయుదునని తాను మాట ఇచ్చిన కీడు చేయకమానెను.

యోనా 3 : 10.

దేవుడు కీడు విషయమై శోధింప బడనేరడు. ఆయన ఎవనిని శోధింపడు గనుక ఎవడైనను శోధింపబడినప్పుడు- నేను దేవుని చేత శోధింపబడు చున్నానని అనకూడదు. యాకో 1 : 13.

ఆ సంగతులుజరిగిన తరువాతదేవుడు అబ్రాహామును పరిశోధించెను.

ఆది 22 : 1.

(పై వాక్యంలో "పరిశోధించెను" అని వున్న పదాన్ని 1950 సంవత్సరానికి ముందు ముద్రింపబడిన పరిశుద్ధ గ్రంథము లలో "శోధించెను" అని వుండగా కాల క్రమంలో ఈ పదాన్ని విస్తృతార్థం వచ్చే రీతిలో మార్చారు — అను)

యెహోవా కోపము ఇశ్రాయేలీయుల మీద రగులుకొనగా ఆయన దావీదును వారి మీదికి ప్రేరేపణ చేసి-నీవు పోయి ఇశ్రాయేలు వారిని యూదా వారిని లెక్కించుమని అతనికిఆజ్ఞ ఇచ్చెను.

2 సమూ 24 : 1.

సాతాను ఇశ్రాయేలీయులకు విరోధముగా లేచి, ఇశ్రాయేలీయులను లెక్కించుటకు దావీదును ప్రేరేపించెను.

1 దిన 21 : 1.

శూన్యమండలము పైని ఉత్తర దిక్కున నున్న ఆకాశ విశాలమును ఆయన పరచెను. శూన్యము పైని భూమిని వ్రేలాడ చేసెను.

యోబు 26 : 7.

భూమియొక్క స్తంభములు యెహోవా వశము లోకమును వాటి మీద ఆయన నిలిపియున్నాడు. 1 సమూ 2:8.

భూమి ఎన్నటికిని కదలకుండునట్లు

ఆయన దానిని పునాదులమీదస్థిరపరచెను.
కీర్త 104 : 5.

సాక్షమిచ్చువారు ముగ్గురు. అనగా ఆత్మయు, నీళ్ళును, రక్తమును, ఈ ముగ్గురు ఏకీభవించి యున్నారు.
1 యోహా 5 : 7.

(ఆంగ్ల అనువాదం ప్రకారం "పరలోకములో ముగ్గురు సాక్షులున్నారు. తండ్రి, వాక్కు, పవిత్రాత్మ. ఈ ముగ్గురూ ఒక్కడే" అని ఉండాలి. పవిత్ర గ్రంథంలో ఈ అసలర్థాన్ని బ్రాకెట్ లో పెట్టి చూపారు.—అను)

ఇశ్రాయేలూ వినుము. మన దేవుడైన యెహోవా అద్వితీయుడగు యెహోవా. ద్వితీ 6 . 4.

ఆంగ్ల అనువాదం ప్రకారం "యెహోవా మన దేవుడు. యెహోవా ఒక్కడే" అని ఉండవలసిన వాక్యాన్ని పై విధంగా అనువదించారు. పవిత్ర గ్రంథంలో దీన్ని సరిగానే అనువదించారు—అను)

యెహోవా తన మార్గము లన్నిటిలో నీతి గలవాడు. తన క్రియలన్నిటిలో కృప చూపువాడు.
కీర్త 145 : 17.

యెహోవా దయా దాక్షిణ్యపూర్ణుడు. దీర్ఘశాంతుడు కృపాసమృద్ధి గలవాడు.
కీర్త 103 : 8.

యెహోవా దయాళుడు. ఆయన కృప నిత్యముండును. కీర్త 100 : 5.

నేను నీతి పరుడగు దేవుడను.
యెష 45 : 21.

సైన్యముల కధిపతియగు యెహోవా సెలవిచ్చిన దేమనగా – అమాలేకీయులు ఇశ్రాయేలీయులకుచేసినది నాకు జ్ఞాపకమే. వారు ఐగుప్తులో నుండి రాగానే అమాలేకీయులు వారికి విరోధులై మార్గమందు వారి మీదికి వచ్చిరి గదా. కాబట్టి నీవు పోయి కనికరింపక అమాలేకీయులను హతము చేయుచు, పురుషులనేమి స్త్రీలనేమి ఒంటెలనేమి గార్దభములనేమిఅన్నిటిని హతము చేసి వారికికలిగినదంతయు బొత్తిగా పాడుచేసి అమాలేకీయులను నిర్మూలము చేయుమని చెప్పెను.
1 సమూ 15 : 2, 3.

(సుమారు 400 సంవత్సరములు అమాలేకీయులమీద దాడులు, దండనలు కొనసాగాయి)

సర్వ జీవుల కన్నులు నీపైపు చూచు చున్నవి. తగిన కాలమందు నీవు వారికి ఆహార మిచ్చుదువు. నీవు నీ గుప్పిలిని విప్పి ప్రతి జీవి కోరికను తృప్తి పరచు చున్నావు. కీర్త 145 : 15, 16

సృష్టియావత్తు ఇది వరకు ఏకగ్రీవ ముగా మూలుగుచు ప్రసవవేదన పడు చున్నదని యెరుగుదుము.
రోమీ 8 : 22.

దేవుని ప్రేమించు వారికి మేలు కలుగుటకై సమస్తమును సమకూడి జరుగుచున్నవని యెరుగుదుము.
రోమీ 8 : 28.

ప్రభువుతాను ప్రేమించు వానినిశిక్షించి తాను స్వీకరించు ప్రతి కుమారుని దండించును. హెబ్రీ 12:6.

సమాధాన కర్తయగు దేవుడు మీ కందరికి తోడైయుండును గాక, ఆమేన్.
రోమీ 15 : 33.

యెహోవా యుద్ధశూరుడు.
నిర 15 : 3.

దేవుడు ప్రేమయై యున్నాడు.
1 యోహా 4 : 8.

దేవుడు దహించు అగ్నియైయున్నాడు
హెబ్రీ 12 : 29.

ఆయన మనుష్యులందరు రక్షణ పొంది సత్యమును గూర్చిన అనుభవ జ్ఞానము గలవారై యుండవలెనని యిచ్ఛ యించుచున్నాడు. 1 తిమో 2 : 4.

వారు కన్నులతో చూచి హృదయ ముతో గ్రహించి మనస్సు మార్చుకొని నా వలన స్వస్థపరచ బడకుండునట్లు ఆయన వారి కన్నులకు అంధత్వము కలుగజేసి వారి హృదయము కఠినపర చెను. యోహా 1:240.

దేవుని మాటలన్నియు పుటము పెట్ట బడినవే. సామె 30 : 5.

నీవు పోయి, వ్యభిచారము చేయుస్త్రీని పెండ్లాడి వ్యభిచారమువల్లపుట్టిన పిల్లలను తీసికొనుము అని యెహోవా హోషేయకు ఆజ్ఞ ఇచ్చెను. హోషే 1: 2
(హోషే 3: 1-3 కూడ చూడండి)

దేవుడు తాను చేసినది యావత్తును చూచినప్పుడు అది చాల మంచిదిగ నుండెను. ఆది 1 : 31.

ఆయన దోషమును అపరాధమును పాపమును క్షమించునుగాని ఏ మాత్రమును దోషులను నిర్దోషులగా ఎంచక మూడు నాలుగు తరములవరకు తండ్రుల దోషమును కుమారుల మీదికిని కుమారుల కుమారుల మీదికని రప్పించును.

నిర్గ 34 : 7.

తమ పితురుల దోషమును బట్టి అతని కుమారులను వధించుటకు దొడ్డి సిద్ధపరుచుడి. యెష14 : 21.

నీ పొరుగు వాని హింసింప కూడదు, వాని దోచుకొన కూడదు.

లేవీ 19 : 13

పైన ఆకాశమందేగాని క్రింద భూమి యందేగాని భూమి క్రింద నీళ్లయందే

ఆలోచించుము. ఆయన తన దూతల యందు నమ్మికయుంచడు. ఆకాశ వైశాల్యము ఆయన దృష్టికి పవిత్రముకాదు.

యోబు 15 : 15.

పాపము చేయువాడే మరణము నొందును. తండ్రియొక్క దోష శిక్షను కుమారుడు మోయుటలేదని కుమారుని దోష శిక్షను తండ్రి మోయడు, నీతిపరుని నీతి ఆ నీతిపరునకే చెందును, దుష్టుని దుష్టత్వము ఆ దుష్టునికే చెందును.

యెహె 18 : 20.

కుమారుల దోషమునుబట్టితండ్రులకు మరణ శిక్ష విధింపకూడదు, తండ్రుల దోషమును బట్టి కుమారులకు మరణశిక్ష విధింపకూడదు. ఎవని పాపము నిమిత్తం వాడే మరణశిక్ష నొందును.

ద్వితీ 24:16.

ప్రతిస్త్రీయు తన పొరుగుదానిని ఇంటనుండు దానిని వెండి నగలను బంగారు నగలను వస్త్రములను ఇమ్మని అడిగి తీసికొని, మీరు వాటిని మీకుమారులకును మీ కుమార్తెలకును ధరింపచేసి ఐగుప్తీయులను దోచుకొందురనెను.

నిర్గ 3 : 22.

నీవు రెండు బంగారు కెరూబులను చేయవలెను. కరుణాపీఠము యొక్క

గాని యుండు దేని రూపమునయినను విగ్రహమునయినను నీవు చేసికొనకూడదు. నిర్గ 20 : 4.

వీరు నిత్య శిక్షకు పోవుదురు. మత 25 : 46.

భూమియు దాని పరిపూర్ణతయు ప్రభునివై యున్నవి. 1 కొరిం 10 : 26

భూమియు దాని సంపూర్ణతయు లోకమును దాని నివాసులను యెహోవావే. కీర్త 24 : 1.

యేసుక్రీస్తు భూపతులకు అధిపతి. ప్రక 1 : 5.

సమీపింపరాని తేజస్సులో ఆయన మాత్రమే నివసించుచున్నాడు. 1 తిమో 6 : 16.

యెహోవా దయా దాక్షిణ్యములు కలవాడు. ఆయన దీర్ఘ శాంతుడు.

రెండు కొనలను నకిషిపనిగాచేయవలెను. నిర్గ 25:18.

ఈయన దోషమును పరిహరించివారు చేసిన అతిక్రమముల విషయమై వారిని క్షమించు దేవుడు. మీకా 7:18.

మరల అపవాది మిగుల ఎత్తయిన యొక కొండ మీదికి ఆయనను తోడుకొని పోయి, ఈలోక రాజ్యములన్నిటిని, వాటి మహిమను ఆయనకు చూపి-నీవుసాగిల పడి నాకు నమస్కారము చేసిన యెడల వీటినన్నిటిని నీ కిచ్చెదనని ఆయనతో చెప్పెను. మత్త 4:89.

ఇప్పుడు ఈ లోకాధికారి (అపవాది) బయటకు త్రోసివేయబడును. యోహా 12 : 31.

ఆయన గుడారమువలె అంధకారము తనుచుట్టు వ్యాపింపజేసెను. జలాంధకారమును ఆకాశ మేఘములను తనకు మాటుగా చేసికొనెను. కీర్త 18:11.

సొలొమోను దానిని చూచి-గాఢాంధకారమందు నివాసము చేయుదునని యెహోవా సెలవిచ్చియున్నాడు.(అనెను) 1 రాజు 8:12.

బేత్షెమెషువారు యెహోవా మందసమును తెరచిచూడగా దేవుడు వారిని

కృపాతిశయము గలవాడు. యెహోవా అందరికి ఉపకారి. ఆయన కనికరములు ఆయన సమస్తకార్యముల మీదనున్నవి.

కీర్త 145 : 8, 9.

న్యాయమైన త్రాసును తూనికరాళ్లును యెహోవాయొక్క యేర్పాటులు.

సామె 16 : 11.

మీ దేవుడైన యెహోవా కరుణా వాత్సల్యములు గలవాడును, శాంత మూర్తియు అత్యంత కృపగల వాడునై యుండి, తాను చేయనుద్దేశించిన కీడును చేయక పశ్చాత్తాప పడును.

యావే 2 : 13.

హృదయ పూర్వకముగా ఆయన నరులకు విచారమునైనను బాధనైనను కలుగజేయడు విలా 3 : 33.

యెహోవా దయాళుడు. ఆయనకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి. దేవ దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి. ప్రభువుల ప్రభువునకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి. ఆయన కృప నిరంతర ముండును. కీర్త 136 : 1-3.

అతని యెదుట యెహోవా అతని దాటి వెళ్లుచు-యెహోవా కనికరము, దయ

హతము చేసి ఆ జనులలో ఏబదివేల డెబ్బది మందిని మొత్తెను. యెహోవా గొప్ప దెబ్బతో అనేకులను మొత్తగా జనులు దుఃఖాక్రాంతులైరి.

1 సమూ 6:19.

యెహోవా రోషముగ్గలవాడై ప్రతికారము చేయువాడు, యెహోవా ప్రతికారము చేయును; ఆయన మహో గ్రత గలవాడు, యెహోవా తన శత్రువులకు ప్రతికారమును, తనకు విరోధులైన వారిమీద కోపముంచు కొనును.

నహూ 1 : 2.

నీ దేవుడైన యెహోవా వారిని నీ కప్పగించునప్పుడు నీవు వారిని హతము చేయవలెను; వారిని నిర్మూలము చేయ వలెను. వారితో నిబంధన చేసికొన కూడదు, వారిని కరుణింపకూడదు .... మరియు నీదేవుడైన యెహోవా నీ కప్ప గించుచున్న సమస్త ప్రజలను నీవు బొత్తిగా నాశనము చేయుదువు. నీవు వారిని కటాక్షింప కూడదు.

ద్వితీ 7:2,16.

యెహోవాస్వాస్థ్యముగా నీకిచ్చుచున్న యీ జనముల పురములలో ఊపిరి

దీర్ఘశాంతము, విస్తారమైన కృపా సత్యములు గల దేవుడని ప్రకటించెను.

నిర్గ 34 : 6.

నీ కనుదృష్టి దుష్టత్వము చూడ లేనంత నిష్కళంకమైనది గదా; బాధించు వారు చేయు బాధను నీవు దృష్టింప జాలవు గదా. హబ 1 13.

ఆయన నీతిని న్యాయమును ప్రేమించు చున్నాడు. లోకము యెహోవా కృపతో నిండియున్నది. కీర్త 33 : 5.

ఆయన ఆశ్రయ దుర్గముగా నున్నాడు. ఆయన కార్యము సంపూర్ణము. ఆయన చర్యలన్నియు న్యాయములు. ఆయన నిర్దోషియై నమ్ముకొనదగిన దేవుడు. ఆయన నీతిపరుడు యధార్థవంతుడు.

ద్వితీ 32 : 4.

గల దేనిని బ్రదుక నియ్యకూడదు.

ద్వితి 20 : 16.

పిరికి వారును, అవిశ్వాసులును .... అగ్ని గంధకములతో మండుగుండములో పాలు పొందుదురు. ప్రక 21:8.

నేను యెహోవాననివారు తెలిసికొను నట్లు వారిని విస్మయము నొందింపవలెనని అనుకూలము కాని కట్టడలను, తాము బ్రదుకుటకు ప్రయోజనకరములు కాని విధులను వారికిచ్చితిని

యెహె 20 : 25.

యెహోవా చేయనిది పట్టణములో ఉపద్రవము కలుగునా ?

ఆమో 3 : 6.

కావున ఆయన ఎవనిని కనికరింప గోరునో వానిని కనికరించును. ఎవని కఠిన పరచగోరునో వాని కఠినపరచును.

రోమా 9 : 18.

నేను యాకోబును ప్రేమించితిని, ఏశావును ద్వేషించితిని.

రోమా 9 : 13.

వారి బాధ సంబంధమైన పొగ యుగ యుగములు లేచును.

ప్రక 14 : 11.

నమ్మని వానికి శిక్ష విధింపబడును.

మార్కు 16 : 16

యెహోవా కన్నులు ప్రతి స్థలము మీద నుండును. చెడ్డవారిని మంచివారిని అవి చూచుచుండును. సామె 15:3.

యెహోవా సెలవిచ్చిన మాట ఏదనగా—నాకు కనబడకుండ రహస్య స్థలములలో దాగ గల వాడెవడైన కలడా? నేను భూమ్యాకాశముల యందంతట నున్నవాడను కానా? యిర్మీ 23:24

ఏలయనగా వారు పోయిన త్రోవలన్నిటిమీద దృష్టి యుంచితిని, ఏదియు నా కన్నులకు మరుగు కాలేదు. వారి దోషమును నాకు మరుగై యుండదు.
16 : 17.

యెహోవా నరుల కుమారులు కట్టిన పట్టణమును గోపురమును చూడ దిగి వచ్చెను. ఆది 11 : 5.

మరియు యెహోవా—సొదొమ గొమొఱ్ఱాలను గూర్చిన మొర గొప్పది గనుకను వాటి పాపము బహుభారమైనది గనుకను నేను దిగిపోయి నా యొద్దకు వచ్చిన ఆ మొర చొప్పుననే వారు సంపూర్ణముగా చేసిరోలేదో చూచెదను. చేయని యెడల నేను తెలిసికొందుననెను.
ఆది 18:20,21.

ప్రవక్త పలికిన ప్రకారము సర్వోన్నత హస్తకృతాలయములలో నివసింపడు. అపో 7 : 48.

నీవు నివాసము చేయుటకు నేను మందిరము కట్టించియున్నాను. సదాకాలము అందులో నీవు నివసించుటకై నేనొక స్థలము ఏర్పరచియున్నాయు.
1 రాజు 8 13.

తనకు నిజముగా మొఱ్ఱపెట్టువారికందరికి యెహోవా సమీపముగా ఉన్నాడు.
కీర్త 145 : 18

యెహోవా, నీ వెందుకు దూరముగా నిలుచుచున్నావు? ఆ పత్కాలములలో నీవెందుకు దాగియున్నావు?
కీర 10 : 1.

దేవుడు మనకు ఆశ్రయమును దుర్గమునై యున్నాడు. ఆ పత్కాలములో ఆయన నమ్ముకొనదగిన సహాయకుడు.
కీర్త 46 : 1.

నా దేవా నా దేవా, నీవు నన్నేల విడనాడితివి? నన్ను రక్షింపక నా ఆర్తధ్వని వినక నీ వేల దూరముగా నున్నావు?
కీర్త 22 : 1.

దేవుడు-జీవము కలిగి చలించువాటిని జలములు సమృద్ధిగా పుట్టించును గాకనియు పక్షులు భూమిపైని ఆకాశ విశాలములో ఎగురును గాకనియు పలికెను.

ఆది 1:20.

దేవుడైన యెహోవా ప్రతి భూజంతువును, ప్రతిఆకాశపక్షిని నేలనుండి నిర్మించెను. ఆది 2 : 19.

ధర్మ శాస్త్రమును అనుసరించి ప్రవర్తించు వారే నీతి మంతులుగా ఎంచబడుదురు. రోమా 2 : 13.

ధర్మశాస్త్ర సంబంధమైన క్రియల మూలముగా ఏ మనుష్యుడును ఆయన దృష్టికి నీతిమంతుడని తీర్చబడడు.

రోమా 3 : 20.

ప్రధాన యాజకులును పెద్దలును ఆయన మీద నేరము మోపినప్పుడు ఆయన ప్రత్యుత్తర మేమియు ఇయ్యలేదు. మత్త 27 : 12.

ప్రధాన యాజకుడు ఆయన శిష్యులను గూర్చియు యేసును అడుగగా యేసు — నేను బాహాటముగా లోకము ఎదుట మాటలాడితిని యూదు లందరు కూడివచ్చు సమాజ మందిరములలోను దేవాలయములలోను ఎల్లప్పుడును బోధించితిని. రహస్యముగా నేనేమియుమాటలాడలేదు.

యోహా 18:19,20.

(యోహా 18:21-23 కూడచూడండి)

కాబట్టి పిలాతు-నీమీద వీరెన్ని నేరములు మోపు చున్నారో నీవు వినలేదా ? అని ఆయనను అడిగెను. అయితే ఆయన ఒక మాటకైనను అతనికి ఉత్తర మియ్యలేదు గనుక అధిపతి మిక్కిలి ఆశ్చర్యపడెను. మత్త 27 : 13, 14.

పిలాతు తిరిగిఅధికార మందిరములో ప్రవేశించి యేసును పిలిపించి-యూదుల రాజువు నీవేనా అని ఆయన నడుగగా యేసు-నీ అంతట నీవే యీ మాట అనుచున్నావా? లేక ఇతరులు నీతో నన్ను గూర్చి యిది చెప్పిరా? అని అడిగెను.

(యోహా 18:35-38 కూడచూడండి)

వారు మీలో కొందరిని చంపింతురు.
లూకా 21 : 16.

కాని మీ తల వెంట్రుకలలో ఒక టైనను నశింపదు. లూకా 21:18.

మనుష్యులు నియమించు ప్రతి కట్టడకును....లోబడి యుండుడి.
1 పేతు 2 : 13.
(రోమీ 13 : 1, 2 కూడ చూడండి)

అందుకు పేతురు అపొస్తలులును - మనుష్యులకు కాదు దేవునికే మేము లోబడవలెను గదా అనిరి.
అపొ 5 : 29.

ఆయన తన పన్నెండు మంది శిష్యులను పిలిచి, సమస్తమైన దయ్యముల మీద శక్తిని అధికారమును, రోగములను స్వస్థపరచు వరమును వారి కనుగ్రహించెను. లూకా 9 : 1.
(మత 10 : 1, 8 కూడ చూడండి)

అంతట యేసు ఆ దయ్యమును గద్దింపగా అది వానిని వదలిపోయెను. ఆగడియ నుండి ఆ చిన్నవాడు స్వస్థత నొందెను. తరువాత శిష్యులు ఏకాంతముగా యేసునొద్దకు వచ్చి మేమెందుచేత దానిని వెళ్ళగొట్టలేక పోతిమని అడిగిరి. అందుకాయన మీ అల్ప విశ్వాసము చేతనే అనెను. మత 17:18 20

మీకు ఆవగింజంత విశ్వాసముండిన యెడల....మీకు అసాధ్యమైనది ఏదియు నుండదు. మత 17 : 20, 21.

ఆయన ఇంటిలోనికి వెళ్ళిన తరువాత ఆయన శిష్యులు- మేమెందుకు ఆ దయ్యమును వెళ్ళగొట్టలేక పోతిమని ఆయన నడిగిరి. అందుకాయన-ప్రార్థన వలనను ఉపవాసము వలననేగాని మరి దేనివలననైనను ఈ విధమైనది వదలిపోవుట అసాధ్యమని వారితో చెప్పెను.
మార్కు 9:28, 29.

ఆయన (యేసు) కపెర్నహూములో ప్రవేశించినప్పుడు ఒక శతాధిపతి ఆయనయొద్దకు వచ్చి- ప్రభువా, నా దాసుడు

శతాధిపతి యేసును గూర్చి విని, ఆయన వచ్చి తన దాసుని స్వస్థ పరచవలెనని ఆయనను వేడుకొనుటకు

పక్షవాయువుతో మిగుల బాధపడు చున్నాడని....వేడుకొనెను.

మత్త 8 : 5, 6.

యూదుల పెద్దలను ఆయన యొద్దకు పంపెను.

ఆయనతో కూడ సిలువ వేయబడిన వారును ఆయనను నిందించిరి.

మార్కు 15 : 32.

ఆయనతో కూడ సిలువవేయ బడిన బందిపోటు దొంగలను ఆయనను నిందించిరి. మత్త 27 : 44.

వ్రేలాడ వేయబడిన ఆ నేరస్థులలో ఒకడు ఆయనను దూషించెను............

....అయితే రెండవవాడు వానిని గద్దించెను. లూకా 23 : 39, 40.